# CHANDAMAMA

## IS GOING PLACES



**You have read Vetala stories in Chandamama for the last 53 years**

**Now you can see**

*Vetala on the Net*

*And many more goodies from Chandamama*

**Visit**

**www.schoolnetindia.com**

# చందమామ



సంపుటి 103 నవంబర్ 2000 సంచిక 5

విషయసూచిక

## కథలు





## పౌరాణిక సీరియల్





## బాలల రచనలు - చిత్రాలు





## దీపావళి ప్రత్యేక రచనలు







## శీర్షికలు









## పోటీలు



Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai-600 026 on behalf of Chandamama India Limited, New 82 (Old 92), Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor: Viswam

దూర తీరాల్లో వున్న

## మీ వాళ్ళ కోసం

ముచ్చటగా ఇవ్వతగ్గ

ఏకైక బహుమతి



# చందమామ

వారి భాషల్లో
వారితో మాట్లాడే
చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ, కన్నడ
మలయాళం,మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు
పన్నెండు సంచికలు రూ. 900

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా
పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనిఆర్డరు ద్వారా గానీ
చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది
చిరునామాకు పంపండి:

PUBLICATION DIVISION
CHANDAMAMA INDIA LIMITED
New 82 (Old 92), Defence Officers Colony,
Ekkatuthangal, Chennai - 600 097.

సంపాదకుడు
విశ్వం

ఉత్తర ప్రత్యుత్తరాలకు:
చందమామ మేగజైన్ డివిజన్
కొత్త నం.82 (పాత నం.92)
డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్,
చెన్నయ్ - 600 097.
ఇ.మెయిల్: Chandamama@ vsnl.com

అమెరికాలో
విడికాపీ $2
సంవత్సర చందా $20
సొమ్ము పంపవలసిన చిరునామా:
ఇండియా అబ్రాడ్
43 వెస్ట్ 24 స్ట్రీట్
న్యూయార్క్ ఎన్.వై 10010
ఫోన్: (212) 929-1727
ఫ్యాక్స్: 212-627-9503



## అక్టోబర్ 2000 భారతదర్శనం క్విజ్ సమాధానాలు

1. ఎ) బదరికాశ్రమం బి) శ్రీరంగం సి) శ్రీజగన్నాథపూరీ డి) అలహాబాద్, ప్రాచీన ప్రయాగ ఇ) బదరికాశ్రమ సమీపంలో.
2. మదురైలో. మీనాక్షీ సుందరేశ్వరులు.



సంచాలకులు
చక్రపాణి. బి.నాగిరెడ్డి

# అసలు నిజం!

నవంబర్ నెల భారతదేశంలోని బాలలకు అంకితం! అంటే, దీని అర్థం ఏమిటి? ప్రజలు ఈ నెలలో పిల్లల సంక్షేమం గురించీ; వారి జీవితాలను ఆనందమయం, ప్రయోజనకరం చేయడం ఎలా అన్న విషయాల గురించీ ఆలోచిస్తారన్న మాట!

బాలల భవిష్యత్తు గురించి ప్రతి ఆడా, మగా ఆలోచిస్తారనే అనుకుందాం. అయితే రేపటి జీవితం సాగించవలసిన వారు బాలలే తప్ప, ఈనాటి పెద్దలు కారు. కాబట్టి తమ భవిష్యత్తును గురించి పిల్లలే జాగ్రత్త పడవలసిన అవసరం ఉన్నదన్న నిజం మరిచిపోకూడదు.

హింసలతో, అవాంఛనీయ శక్తులతో నిండిన భయంకర ప్రపంచాన్ని మనం పిల్లలకు అందిస్తున్నాం. వాతావరణ కాలుష్యంతో నిండిన భూమికి బాలలు వారసులవుతున్నారు. వీటన్నిటికీ మూలకారణం ఒకటే. అధి కారం-ధనం ఈ రెండు మాత్రమే ఆనందాన్ని ఇవ్వగలవని ఈనాటి మాన వుడు విశ్వసిస్తున్నాడు. ఇది చాలా పొరబాటు. ప్రస్తుతం చెలరేగుతూన్న రాజకీయ, ఆర్థిక, మతపరమైన పొరపొచ్చాలకూ, ద్వేషాలకూ, సంఘర్షణ లకూ, పోటీలకూ మూలాధారం ఈ ఒక్క అవగాహనాలోపమే.

నిజానికి ఆనందం అన్నది కేవలం బాహ్యశక్తులమీదా, అవసరాల మీదా ఆధారపడి లేదు. సదవగాహన మీదా, వ్యక్తిగత స్వభావం మీదా, సత్ప్రవర్తనా బలం మీదా ఆధారపడి వుంటుంది. అసలు నిజం చెప్పాలంటే పిల్లలయిన మీరు మాత్రమే మిమ్మల్ని సంతోషపరచుకోగలరు. వేరెవరివల్లా కాదు. ఆఖరికి మిమ్మల్ని ప్రాణప్రదంగా ప్రేమించే మీ తల్లిదండ్రులు కూడా ఆనందాన్ని మీకు అందించలేరు. మీ పట్ల నమ్మకమున్నది గనక, మీ పత్రిక మీకా అసలు నిజం చెబుతున్నది!



# వార్తలలో బాలలు

## ప్రాణాలు కాపాడిన డాల్ఫిన్!



ఫిలిప్పో అనే డాల్ఫిన్ సాయం కారణంగా పధ్నాలుగేళ్ళ డేవిడ్ సెస్ సముద్రంలో మునిగి జలసమాధి అయిపోకుండా ప్రాణాలతో బయటపడ్డాడు. దక్షిణ ఇటలీ మన్రెడోనియా సమీపంలో — డేవిడ్ తన తండ్రితో కలిసి పడవలో ప్రయాణిస్తూండగా, పెద్ద అల తాకిడికి పడవ కుదుపుకు లోనయింది. దాంతో డేవిడ్ ఎగిరి నీళ్ళలో పడ్డాడు. వాడికి ఈత రాదు గనక మునిగిపోసాగాడు. అంతవరకు పడవ వెనకే ఈదుతూ వచ్చిన ఒక డాల్ఫిన్, డేవిడ్ ప్రాణాలతో కొట్టిమిట్టాడడం చూసింది. మునిగిపోకుండా తన వీపుపై వాణ్ణి పైకెత్తింది. డాల్ఫిన్ తనకు సాయం చేయడానికి ప్రయత్నిస్తున్నదని తెలియగానే డేవిడ్ దానిని గట్టిగా పట్టుకున్నాడు. డాల్ఫిన్ వాణ్ణి పడవ దగ్గరికి తీసుకువచ్చి, పడవలోని వాడి తండ్రికి అందేలాగా బలంగా విసిరింది! డేవిడ్ ప్రాణాలతో బయటపడ్డాడు! ఆ ప్రాంతంలోని మత్స్యకారులు దానికి ఫిలిప్పో అని పేరు పెట్టి తమ మస్కట్ (అదృష్టచిహ్నం)గా చేసుకున్నారు!

## పాపాయిని కాపాడిన కుర్రవాడు!



కేరళకు చెందిన అక్బర్ అనే పధ్నాలుగేళ్ళ కుర్రవాడు బడికి వెళ్ళివచ్చి అన్నం తింటూండగా, పక్కింటి కుర్రవాడు లబోదిబోమంటూ ఏడ్వడం వినిపించింది. తింటూన్న పళ్ళాన్ని అలాగే వదిలి, ఎంగిలి చేత్తో వెలుపలికి వచ్చాడు అక్బర్. రెండేళ్ళ పాప బావిలో పడిపోయింది. అందుకే వాడలా ఏడుస్తున్నాడు. అక్బర్ ఒక్కగెంతున 8 మీటర్ల లోతు బావిలోకి దూకి పాపను పొదివి పట్టుకుని జాగ్రత్తగా అక్కున చేర్చుకున్నాడు. ఒక చేత్తో బిడ్డనూ, మరొక చేత్తో పైప్‌లైన్నూ పట్టుకున్నాడు. గట్టు చుట్టూ చేరిన స్త్రీలు నెత్తీ నోరూ బాదుకుంటూ రోదించారే తప్ప మరేమీ చేయలేక పోయారు. 90 నిమిషాల తరవాత కొందరు మగవాళ్ళు వచ్చి, చేతాడును బకెట్‌కు కట్టి బావిలోకి వదిలారు. అక్బర్, పాపను అందులో వుంచాడు. పైనున్న వాళ్ళు క్షేమంగా పైకి లాగేశారు. బకెట్ చిన్నది గనక అక్బర్ అందులోకి వెళ్ళలేకపోయాడు. చేతాడును వదలండి దాన్ని పట్టుకుని వస్తానని అక్బర్ చెప్పాడుగాని వాడిమాటలు పైకి వినిపించలేదు. ఆ తరవాత అతనికి సరిపడా ఒక పెద్ద కుర్చీని బావిలోకి వదిలి అతన్ని పైకి లాక్కున్నారు. సాహసబాలల అవార్డుకు అక్బర్ అన్నివిధాలా అర్హుడు అనడంలో సందేహం లేదు!

## మావటి అమ్మాయి?



కొన్ని జంతుప్రదర్శనశాలలలో జంతువుల పిల్లలను పెంచడానికి 'తల్లులను' నియమించడం గురించి మనం విన్నాం. అయితే, పదమూడేళ్ళవిజయలక్ష్మి – పదడుగుల ఎత్తు వున్న 31 సంవత్సరాల ఏనుగు రక్షణ బాధ్యతలు వహిస్తున్నది. కేరళ రాష్ట్రం త్రిసూరుకు చెందిన అశోక్ కుమార్ – బీహార్‌లో శ్రీకృష్ణ అనే ఈ ఏనుగును కొని స్వస్థలానికి తీసుకువచ్చాడు. దాంతో పాటు వచ్చిన మావటీలు వెళ్ళిపోయాకే – ఏనుగు హిందీ మాటలను మాత్రమే అర్థం చేసుకోగలదని తెలుసుకున్నాడు. ఏంచేయడమో తెలియక పొడవాటి కర్ర తీసుకుని ఏనుగును నడిపించడానికి తీసుకువెళ్ళాడు. ఏమవుతుందో ఏమో అని అతని బావమరిది అతనికి తోడుగా వెళ్ళాడు. ఏడవ తరగతి చదువుకుంటూన్న అశోక్‌కూతురు విజయలక్ష్మికి సరిగ్గా అప్పుడే తాను బడిలో హిందీ నేర్చుకుంటూన్న విషయం గుర్తుకు వచ్చింది. ఆమె 'ఛలో' అంటూ దాని దగ్గరికి వచ్చింది. 'ఆవో' 'ఉఠో' 'బైఠో' అనే మాటలు విని ఏనుగు సంతోషించివుండాలి. ఇద్దరూ స్నేహి తులైపోయారు. ఇప్పుడు బడినుంచి రాగానే విజయలక్ష్మి శ్రీకృష్ణను 'ఈవినింగ్ వాక్'కు తీసుకువెళుతోంది. ఏనుగుదంతం పట్టుకుని మరీ ఆమె ఎంతో విశ్వాసంతో ముందు నడుస్తుంది!

## పళ్ళతో విన్యాసం




మధ్యప్రదేశ్‌లోని డాటియాకు చెందిన సీమా భదోరియా కనిపిస్తే – నువ్వేం పళ్ళపొడి / టూత్‌పేస్ట్ వాడుతున్నావని అడక్కండి. ఆమె చెప్పకపోవచ్చు. అయితే ఆమె తన పళ్ళతో విమానాన్ని లాగే గొప్ప విన్యాసాన్ని తిలకించడానికి మిమ్మల్ని ఆహ్వానించవచ్చు. పదో తరగతి చదువుతూన్న ఈ అమ్మాయి, భోపాల్ లోని బైరాఘడ్ విమానాశ్రయంలో ఆ సాహసమే చేసి చూపించింది. 14 సీట్లు గల గవర్నమెంటు విమానాన్ని ఆమె పళ్ళతో లాగింది.దీనిద్వారా ఆమె పేరు గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో చోటుచేసుకోనున్నది. బోయింగ్ 747ను కూడా తన దంతాలతో లాగడానికి ఆమె అనుమతి కోసం విన్నవించింది. ఈ మాట చదవగానే మీ దంతాలు కదిలిపోవడం లేదుకదా!

# ఆకలికి శిక్ష

మందారదేశాన్ని జయంతుడనే రాజు పరిపాలిస్తూండేవాడు. ఆయన గొప్ప పరిపాలనా దక్షుడు. ఒకరోజు పురుషోత్తముడనేవాడు, ధనాగారంలో దొంగతనం చేస్తూ దొరికిపోయాడు. రాజభటులు వాణ్ణి పెడరెక్కలు-విరిచికట్టి, నిండుసభలో రాజు జయంతుడి ముందు నిలబెట్టారు.

జయంతుడు, పురుషోత్తముణ్ణి, "నువ్వు దొంగతనం చేస్తూ పట్టుబడ్డావు. కనుక నువ్వు దొంగవనేందుకు ఇతర సాక్ష్యాధారాలు అవసరంలేదు. ఐతే, నువ్వేమైనా చెప్పుకోదలిస్తే, చెప్పుకో," అన్నాడు.

అప్పటికే శిక్షనుంచి తప్పించుకోవడానికి, ఒక పథకం ఆలోచించివున్న పురుషోత్తముడు, "మహాప్రభూ! ఈ దొంగతనం నేను చెయ్యాలని చెయ్యలేదు. నా ఆకలే నన్ను ఈ దొంగతనానికి పురికొల్పింది కాబట్టి, తమరు నాకు శిక్ష విధించాలనుకుంటే, నా ఆకలికి కూడా శిక్ష విధించండి!" అన్నాడు, తన ఆకలికి ఎలా శిక్ష విధించాలో రాజుకు అర్థంకాక, తనను నిర్దోషిగా వదలివేయక తప్పదని సంబరపడిపోతూ.

దొంగ చెప్పింది శ్రద్ధగా విన్న జయంతుడు, "వీడికి ఒక సంవత్సరం పాటు కారాగార శిక్ష విధించడమే కాకుండా, వీడు చెప్పింది విన్న తర్వాత, దొంగతనానికి పురికొల్పిన వీడి ఆకలిని కూడా శిక్షించడం న్యాయమనిపిస్తున్నది. కాబట్టి, వీడికి ఒక వారంరోజులు తిండిపెట్టకుండా, ఆ ఆకలికి కూడా శిక్ష విధిస్తున్నాను," అన్నాడు.

— బొడ్డేడ బలరామస్వామి



బేతాళ కథలు

# వజ్రదేహుడి పొరబాటు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భీతిగొలిపే ఈ శ్మశానంలో అర్ధరాత్రి వేళ, ఎన్నో కఠోరశ్రమలకు లోనవుతున్నా, నీలో నిస్సహాయతా, నిస్పృహలు మచ్చుకైనా కానరాకపోవడం, నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది. నీలో ధైర్యసాహసాలకు కొదువలేదు. కాని, వాటికి సమతూకంలో వివేక విజ్ఞతలు, సమయస్ఫూర్తి లేకపోతే మాత్రం, నీ శ్రమంతా ఆఖరి క్షణంలో ఎందుకూ కొరగాకుండా పోతుంది. ఇందుకు



ఉదాహరణగా, మహాకుత్సితుడైన మార్జాల భట్టు అనే మంత్రీ, తిరుగులేని ధైర్యసాహ సాలకు మారుపేరైన వజ్రదేహుడనే యువ కుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం మగధరాజ్యాన్ని మహీపాలు డనే రాజు పాలించేవాడు. ఆయన రాజ్య పాలనలో అందెవేసిన చేయి. అంతేగాక, తన శత్రువులను ఎత్తుకుపైఎత్తు వేసి చిత్తు చేయడంలో ఆయనకు ఆయనే సాటి.

మగధకు పొరుగురాజ్యమైన గ్రహణ గిరి రాజు కుంజరుడికి, ఎంతో కాలంగానో మగధను తన హస్తగతం చేసుకోవాలనే బలమైన వాంఛ ఉండేది. అయితే, మహీ పాలుడి దక్షత, అపారమైన సైనిక బలం ముందు తను తీసికట్టుగనక, అతడు మగధపై యుద్ధానికి సాహసించలేకపోయాడు. కొంత కాలం గడిచేసరికి మగధ దక్కలేదన్న నిరాశ, నిస్పృహలతో మనోవ్యాధికి గురై అతడు మంచం పట్టాడు.

ఈ పరిస్థితిలో, మంత్రి మార్జాలభట్టు, రాజు కుంజరుడితో, ''ప్రభూ! బలం బలగం లేక మగధను జయించలేనంత మాత్రాన, మనం ఓటమిపాలైనట్టు దిగులుపడకండి. మగధను జయించడానికి నేనొక తిరుగు లేని పథకం ఆలోచించాను. నేను మారు వేషంలో ఆ రాజ్యం చేరి, నెలతిరక్కుండా, అక్కడ అరాచకం, తిరుగుబాట్లూ లేపి, రాజ్యాన్ని అతలాకుతలం చేస్తాను. ఆ పరి స్థితిని చక్కదిద్దుకునేందుకు రాజు మహీ పాలుడు తలమునకలై వుండగా, మనం మన సైన్యంతో మెరుపుదాడి చేసి సులు వుగా మగధను చేజిక్కించుకుందాం!'' అని చెప్పి, అప్పటికప్పుడే మగధరాజ్యంకేసి ప్రయాణమయ్యాడు.

ఆ సమయంలో, నెల రోజులుగా హృద్రో గంతో బాధపడుతున్న మగధ సైన్యాధిపతి మరణించడం జరిగింది. రాజు మహీపాలుడూ, మంత్రులూ కొత్త సైన్యాధిపతి విషయమై చర్చలు ప్రారంభించారు. చర్చల మధ్య వాళ్ళకు వేగులద్వారా భైరవుడనే ఒక మోస కారి గురించిన వార్త అందింది.

ఈ భైరవుడు పెద్ద మోసకారి. వాడు మగధ సరిహద్దు ప్రాంతాల, అనేక రకా లుగా ప్రజలను మోసగించి పబ్బం గడుపు కునేవాడు. వాడి బాధ భరించలేక ప్రజలు కూడబలుక్కుని, ఒకనాడు వాణ్ణి చావ చితక కొట్టారు. చావునుంచి తప్పించుకుని బయట

పడిన భైరవుడు, ఇక ప్రజల మధ్య వుండడం ప్రమాదమని అరణ్యంలోకి పారిపోయాడు.

అక్కడ వాడు ఏదైనా మంచి స్థావరం దొరుకుతుందేమోనని వెతుకుతూండగా, ఒక పొదమాటునుంచి, ''దాహం! దాహం!'' అన్న మాటలు వినిపించినై.

భైరవుడు, ఆ మాటలు వచ్చిన దిక్కు కేసి వెళ్ళి చూసేసరికి, కొన్ని బండరాళ్ళ మధ్య చిక్కుకుని నీరసించి పడివున్న ముసలి రాక్షసుడొకడు కనిపించాడు. అన్నిటికీ తెగించివున్న భైరవుడు, ఏమాత్రం జంకూ గొంకూ లేకుండా, సమీపంలో కనిపించిన సెలయేటి నుంచి, ఆకు దొనెతో నీళ్ళు తెచ్చి ముసలి రాక్షసుడి దాహం తీర్చాడు. తర్వాత వాడు అతికష్టం మీద రాక్షసుడి మీద వున్న బండరాళ్ళను పక్కకు లాగాడు.



ముసలి రాక్షసుడు, భైరవుడికేసి కృత జ్ఞతగా చూస్తూ, ''నరుడా! నీ మేలు ఈ జన్మకు మరువను. నా సొంత తమ్ముడే, కుంటివాణ్ణన్న జాలికూడా లేకుండా, ఈ అరణ్యం మీద అధికారం కోసం, అదిగో, ఆ కొండమీదినుంచి రాళ్ళు దొర్లించి నన్ను చంపజూశాడు. నీకేం కావాలో చెప్పు, నా చేతనైన సాయం చేస్తాను!'' అన్నాడు.

భైరవుడు, రాక్షసుడి రెండు కుంటి కాళ్ళను చూసి జాలిపడుతూ, ''కుంటి వాడివి, నువ్వేం సాయం చేయగలవు? నాక్కావలసింది ధనం,'' అన్నాడు.

''నరులు రాని చోటిది. మరి బంగారం లాంటివి ఎలా దొరుకుతాయి!'' అన్నాడు రాక్షసుడు. రాక్షసుడిలా అనేసరికి భైర వుడికి చప్పున ఒక ఆలోచన వచ్చింది. వాడు సంతోషంతో, ''నా బుద్ధిబలంతో మను షులు నీ దగ్గరకు వచ్చేలా చేస్తాను. వాళ్ళ మాంసం నీది, నగా నట్రా నాది, సరేనా?'' అని అడిగాడు.

నరమాంసం మాట వింటూనే రాక్షసుడు ''ఆహా, నరమాంసమా! అది తిని దాదాపు నలభై ఏళ్ళయింది. అంతా నువ్వు చెప్పినట్టే చేస్తాను,'' అన్నాడు.

వెంటనే భైరవుడు అక్కణ్ణించి బయలు దేరి, అరణ్యానికి దాపులనున్న మగధరాజ్య ప్రాంతాలలో - త్రేతాయుగం నాటి రాక్షసు డొకడు అరణ్యంలో వున్నాడనీ, వాడొకానొక సందర్భంలో శ్రీరామచంద్రుడితో తలపడడం వల్ల, ఆ స్వామి ఆగ్రహానికి గురై రెండు కాళ్ళూ పోగొట్టుకుని, శ్రీరామనామస్మరణతో జీవిస్తున్నాడనీ ప్రచారం ప్రారంభించాడు.



కొత్త సేనాపతిని చేస్తామని చాటింపు వేయిం చండి. ఇందువల్ల మనకు సమర్థుడైన సేనా పతి లభించడమేగాక, ప్రజల సమస్య కూడా పరిష్కారమవుతుంది,'' అన్నాడు.

మంత్రులు, రాజు చెప్పిన విధంగా చాటింపు వేయించారు.

ఈ చాటింపు విని, యువరాజుకు బాల్య మిత్రుడైన పృథ్వీ అనేవాడు అరణ్యానికి బయలుదేరాడు. ఈ పృథ్వీ యువరాజుతో పాటు, అన్ని క్షత్రియవిద్యల్లోనూ ఆరి తేరినవాడు. అరణ్యంలో చాలా దూరం వెతుక్కుంటూ పోయి, ముసలి రాక్షసుడున్న స్థావరం తెలుసుకున్నాడు. అయితే, ఆవేశం కొద్దీ వెంటనే వాడి మీదికి పోకుండా, ఒక చెట్టు చాటున దాగి, రాక్షసుడి చర్యలు గమనించసాగాడు.

ఈ ప్రచారం నమ్మి రాక్షసుణ్ణి చూడా లని అరణ్యంలోకి వెళ్ళిన వాళ్ళలో కొందరు క్రూరమృగాలకు భయపడి తిరిగివచ్చేవాళ్ళు. మరి కొందరు సాహసించి రాక్షసుణ్ణి వెతు క్కుంటూపోయి వాడికి ఆహారమయ్యేవాళ్ళు. రెండు మూడు రోజులకొకసారి భైరవుడు, రాక్షసుణ్ణి రహస్యంగా కలుసుకుని, వాడు తిన్న మనుషులనుంచి జాగ్రత్తగా తీసి పెట్టిన బంగారు ఆభరణాలను తెచ్చుకునేవాడు.

రాక్షసుడి గురించి భైరవుడు చేస్తున్న ప్రచారం, కొందరు మనుషులు అరణ్యం లోకి పోయి తిరిగి రావడం లేదన్న సమా చారం తప్ప, మరే వివరాలూ తెలియని రాజు మహీపాలుడు, మంత్రులతో, ''అర ణ్యంలో వాస్తవంగా జరుగుతున్నదేమిటో తెలుసుకుని ప్రజలను రక్షించగలవాణ్ణి

ఆ రోజు ప్రజలెవరూ రాక్షసుడి దగ్గరకు రాలేదు. సాయంకాలం వేళకు భైరవుడు ఒక సంచీతో అక్కడికి వచ్చాడు. వాణ్ణిచూస్తూనే రాక్షసుడు రాతికింద దాచి పెట్టిన ఆభర ణాలను వాడికిచ్చాడు. భైరవుడు వాటిని సంచీలో వేసుకుని వచ్చిన దారి పట్టాడు. ఇదంతా గమనించిన పృథ్వీ, భైరవుణ్ణి వెంబడించి, అరణ్యం దాటగానే వాడి పెడ రెక్కలు విరిచికట్టి, రాజు మహీపాలుడి దగ్గ రకు తీసుకుపోయి, జరుగుతున్న మోసం వివరించి, ''ప్రభూ! ఈ భైరవుడు చేస్తున్న మోసాన్ని తెలియజేస్తూ చాటింపు వేయిస్తే, ప్రజలెవరూ రాక్షసుణ్ణి చూడడానికి వెళ్ళరు. కుంటివాడైన ముసలి రాక్షసుడు నరమాంసం కోసం అరణ్యం దాటి వచ్చే సమస్యే వుండదు,'' అని చెప్పాడు.

కత్తి ఎత్తకుండానే, కేవలం తెలివి తేట లతో సునాయాసంగా అంత పెద్ద సమస్యను పరిష్కరించినందుకు రాజు మహీపాలుడు, పృథ్వీని అభినందించి, భైరవుణ్ణి చెరసాలకు పంపాడు.

మరుసటి రోజున, నిండుసభలో రాజు మహీపాలుడు, పృథ్వీకి సర్వసైన్యాధిపతి పదవితో సన్మానించే సన్నాహాల్లో వుండగా, "మహారాజా! మాయోపాయంతో మన ప్రజలను పీక్కుతింటున్న రాక్షసుడి తల తెగనరికాను, ఇదుగో!" అంటూ, వజ్రదేహుడనే వాడు చేతిలో వున్న ముసలిరాక్షసుడి తలను ఎత్తి చూపుతూ సభలో ప్రవేశించాడు.

వాడి వెనుకగా గుంపుల కొద్దీ వచ్చిన వాడి అనుచరులతో సభ కిటకిటలాడి పోయింది. ఈ వజ్రదేహుడి తండ్రి జ్ఞాన ముని అనే సుప్రసిద్ధ గురువు. ఆయన బ్రతికివుండగా గురుకులాన్ని నిర్వహించి, మగధరాజ్యంలో ఎందరో మేధావులను తీర్చి దిద్దాడు. తండ్రికున్న ఖ్యాతి కారణంగానే, ఆయన పట్ల గౌరవమర్యాదలున్న ఎందరో అభిమానులు, సేనాపతి పదవికోసం ప్రయత్నించమని వజ్రదేహుణ్ణి ప్రోత్సహించారు. వాడు అరణ్యానికి పోయి రాక్షసుడి తల నరికి, రాజు దగ్గరకు తెచ్చాడు.

రాక్షసుడి తల చూసి క్షణకాలం నివ్వెరపోయిన రాజు మహీపాలుడు, వజ్రదేహుడితో, ఈ పరీక్షలో నీకన్న ముందుగా పృథ్వీ నెగ్గాడు. ఎవరికీ తనకు తానై హాని చేయలేని ముసలికుంటి రాక్షసుణ్ణినువ్వు చంపావు. పృథ్వీ అలాకాక, ఈ అనర్థానికి మూలకారకుడైన భైరవుణ్ణి బంధించాడు. భైరవుణ్ణి



బంధించడమే సమస్యకు తగిన పరిష్కారం!" అన్నాడు.

రాజు మాటలకు ఆవేశపడ్డ వజ్రదేహుడి మిత్రులు, రాజు నిర్ణయం సరైంది కాదని కేకలు పెట్టసాగారు. వజ్రదేహుడు వాళ్ళను శాంతపరచి, సభనుంచి వెనుదిరిగాడు. వాళ్ళకు వెనకనే నల్లటి కంబళి కప్పుకుని, బవిరిగడ్డంతో జనం మధ్య పొంచి వున్న మంత్రి మార్జాలభట్టు కూడా కదిలాడు. వాడు కొంత దూరం వాళ్ళ వెన్నంటి నడచి, వజ్రదేహుణ్ణి కలుసుకుని, "వజ్రదేహా! యువరాజుకు మిత్రుడైనందువల్లనే పృథ్వీకి సేనాపతి పదవి దక్కింది. ఒంటరిగా రాక్షసుణ్ణి మట్టుబెట్టిన నీలాంటి సాహసవంతుడు సేనాని కాదగినవాడు. నువ్వూ, నీ మిత్రులూ కలిసి నేను చెప్పినట్టు చేశారంటే, ఆ సేనా



పతి పదవి నీ కాళ్ళ దగ్గరకు వచ్చేలా చేస్తాను,'' అంటూ రెచ్చగొట్టి, అందరినీ తన రహస్య స్థావరానికి తీసుకువెళ్ళాడు.

ఆ మర్నాడు మార్జాలభట్టు సలహామేరకు, వజ్రదేహుడి నాయకత్వంలో వాడి మిత్రులందరూ కలిసి, నగరంలోని వ్యాపార స్థావరాలను ధ్వంసం చేసి, ప్రముఖవ్యక్తుల్నీ, ఉన్నత రాజోద్యోగులనూ అదను చూసి పట్టి తెచ్చి, రహస్య స్థావరంలో బంధించి - వజ్రదేహుడికి సేనాపతి పదవి కట్టబెట్టే వరకూ వాళ్ళను విడిచిపెట్టమని మహీపాలుడికి బెదిరింపు లేఖలు రాశారు.

రాజు బాగా ఆలోచించి, వజ్రదేహుణ్ణి గురించిన పూర్తి సమాచారం సేకరించుకు రమ్మని వేగులను పంపాడు. వాళ్ళు రెండు రోజులలో తిరిగివచ్చి రాజుతో, ''ప్రభూ! వజ్రదేహుడి అరాచకాల వెనుక, గ్రహణగిరి రాజు హస్తం వున్నది. కుటిలుడైన ఆయన మంత్రి మార్జాలభట్టు మన రాజ్యంలో సంచరిస్తూ, వజ్రదేహుణ్ణి పావుగా వాడుకుంటున్నాడు,'' అని చెప్పారు.

రాజు మహీపాలుడు, మంత్రులతో సంప్రదించి, పృథ్వీని సేనాపతి పదవినుంచి తొలగించి, వజ్రదేహుణ్ణి ఆ స్థానంలో నియమించనున్నట్టు చాటింపు వేయించాడు.

ఈ చాటింపు విని వజ్రదేహుడి మిత్రులు, మేళతాళాలతో అతణ్ణి తీసుకువచ్చేందుకు వెళ్ళారు. కాని, వజ్రదేహుడు అక్కడ లేడు. మార్జాలభట్టు మాత్రం తలపగిలి చచ్చిపడి వున్నాడు. అతడికి ఎదురుగా వున్న ఒక బండ రాతిమీద — ''మిత్రులకు! సైన్యాధిపతి పదవి నిర్వహించడానికి నేననర్హుణ్ణి. నగరంలో అరాచకానికీ, జరిగిన దుష్కార్యాలకూ కారకుడైన మార్జాలభట్టును హతమార్చి, నేను రాజ్యం వదిలిపోతున్నాను. మీ - వజ్రదేహుడు.'' అని వుంది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, సైన్యాధిపతి పదవికోసం రాజ్యంలో అరాచకం సృష్టించిన వజ్రదేహుణ్ణి దండించవలసింది పోయి, వాడు కోరిన పదవి ఇస్తానని ప్రకటించడం, రాజు మహీపాలుడి అసమర్థత కాదా? తను లేవగొట్టిన అరాచక పరిస్థితులకు తలొగ్గి, రాజు తనను సేనాపతిని చేస్తానని ప్రకటించినప్పటికీ, వజ్రదేహుడు దాన్ని స్వీకరించక రాజ్యం వదిలి పారిపోవడం పొరబాటుకాదా? అలా పారిపోయే వజ్రదేహుడు, తనకు సేనాపతి పదవి వచ్చేందుకు అన్ని విధాలా సహకరించిన మార్జాల

భట్టును ఎందుకు చంపినట్టు? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాజు మహీపాలుడు, వజ్రదేహుడికి సేనాపతి పదవి ప్రకటించడంలో అసమర్థత కాక, ఎంతో రాజనీతి, చతురత వున్నది. అలాకాక, వజ్ర దేహుణ్ణీ, అతడి మిత్రులనూ పట్టి బంధించేందుకు సైనికుల్ని పంపడమంటే - అప్పటికే వాళ్ళ చేజిక్కివున్న పురప్రముఖుల్నీ రాజోద్యోగుల్నీ వాళ్ళు చంపే ప్రమాదం కలిగితీరుతుంది. తను కోరిన సేనాపతి పదవి లభిస్తుందన్న దురాశతో, వజ్రదేహుడు సభకు వచ్చినప్పుడు అతణ్ణి సులువుగా శిక్షించవచ్చు. ఇక, వజ్రదేహుడి విషయానికొస్తే, అతడు స్వతహాగా ధైర్యశాలే కాక, సంస్కారవంతుడు కూడా. రాజు నిండు సభలో తనకు సేనాపతి పదవి ఇవ్వనని చెప్పగానే, అతడి మిత్రులు ఆవేశం కొద్దీ రాజు నిర్ణయం సరైందికాదని కేకలు పెట్టినప్పుడు, వాళ్ళను శాంతపరచి సభనుంచి బయటికి తీసుకుపోయాడు. అయితే, ఆ సమయంలో మార్జాలభట్టు చెప్పిన మోసపు మాటలు విని, తాత్కాలికంగా అతడికి తిరిగి సేనాపతి పదవిపై ఆశ జనించింది. దానితో, దూరదృష్టీ, సాధ్యాసాధ్యాలను గురించిన అంచనా లేని మిత్రులతో కలిసి నగరంలో అరాచకం సృష్టించాడు. ఈ దశలో రాజు తనకు సేనాపతి పదవి ఇవ్వజూపటంతోనే, అతడిలో ఆశా ఆవేశాలు తగ్గి, విజ్ఞతా వివేకాలు మేల్కొన్నవి. గొప్ప విద్యాగురువుగా పేరుమోసిన జ్ఞానముని కుమారుడైన అతడికి, రాజు ఎంతటిపరిపాలనాదక్షుడో తెలుసు. తనకు పదవి ఇస్తానని ఆశచూపి, అప్పటికే నగరంలో ఎన్నో అకృత్యాలు చేసిన తననూ, మిత్రులనూ ఆయన కఠినంగా శిక్షించే ప్రమాదం వున్నది. అందువల్లనే అతడు తగిన సమయస్ఫూర్తితో రాజ్యం వదిలి పారిపోతూ, జరిగిన దురాగతాలకు మూలకారకుడైన మార్జాలభట్టును హతమార్చాడు. వజ్ర దేహుడి ప్రవర్తనలో ఎలాంటి పొరబాటూ లేదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — [కల్పితం]

[ఆధారం : మల్లవరపు మనోహరరెడ్డి రచన]





# సమస్య తీరింది!

రాముకు ఏడేళ్ళు. చదువులోనూ ఆట పాటల్లోనూ గట్టివాడైన రామును చూసి తల్లిదండ్రులు సంతోషించేవారు. ముద్దులు మూటగట్టినట్టు అందరితో ముచ్చటగా మాట్లాడేవాడు. అందువల్ల చుట్టుపక్కల వారికి కూడా రాము అంటే చాలా ఇష్టం.

రాము ఇంట్లో ఒక కుక్కపిల్ల ఉంది. దానిపేరు సమీర. సమీర అంటే రాముకు వల్లమాలిన ఇష్టం. దాంతో ఆడుకోవడంతో పాటు స్వయంగా దానికి ఆహారం పెట్టేవాడు.

రాము తల్లికి కొడుకంటే ఇష్టమేగాని, ఇప్పుడిప్పుడు వాడి దగ్గరి రెండు విషయాలు ఆమెకు బొత్తిగా గిట్టడం లేదు. ఒకటి, తెల్ల వారి బారెడు పొద్దెక్కాక కూడా రాము నిద్ర పోవడం. రెండు, వాడు పొద్దస్తమానం కుక్కతో ఆడుకుంటూ ఉండడం. ఎంత చెప్పినా ఈ రెండు విషయాలలో మాత్రం వాడు తల్లి మాట వినడం లేదు.

తెల్లవారకముందే రాముతల్లికి ఇంటి పనులు ఆరంభమవుతాయి. కళ్ళాపిచల్లి, ఇల్లూవాకిలీ చిమ్మడం; పొలం వెళుతూన్న భర్త అవసరాలు చూడడం; పశువులకు కుడితిపెట్టి పాలు పితకడం అంటూ ఊపిరి సలపలేనన్ని పనులు. ఈ పనుల మధ్య ఆమె కొడుకును తట్టిలేపేది. బలవంతం మీద రాము లేచి కూర్చునేవాడు. కాని ఆమె అటు వెళ్ళగానే, మళ్ళీ ముసుగుదన్ని పడుకునేవాడు. రాముతల్లి పెరట్లో పనులు చేసుకుంటూ వుంటే కుక్కపిల్ల అడ్డదిడ్డంగా తిరుగుతూ చిరాకు కలిగించేది.

ఆ రోజు సాయంకాలం రాము బడినుంచి వచ్చీరాగానే, కుక్కపిల్లతో ఆడుకోవడానికి, మైదానంలోకి బయలుదేరాడు. దానిని చూడ గానే రాము తల్లికి కోపం వచ్చి, ''రామూ, నువ్వు ఆలస్యంగా నిద్రలేవడం వల్ల, రోజూ బడికి ఆలస్యంగా వెళుతున్నావు. మధ్యాన్నం

టి.ఆర్. రాజేశ్వరీ మోహన్

పంతులు కనిపించి కోప్పడ్డారు. నాకున్న పనులు చాలవన్నట్టు నీ కుక్క ఒకటి పొద్దస్తమానం నా చుట్టూ తిరుగుతున్నది. దానితో వేగలేకపోతున్నాను. దాన్ని నువ్వు రేపు తీసుకువెళ్ళి ఊరవతల వదిలిపెట్టిరా,'' అన్నది.

రాము కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "వద్దమ్మా! కుక్కపిల్లను నా వద్దే ఉంచుకుంటాను,'' అన్నాడు మెల్లగా.

"ఊహు, వీలుకాదు. పొద్దున లేవరా అని నేను మొత్తుకుంటున్నా నువ్వు నా మాట వినడం లేదు. అలాంటప్పుడు నీ మాట నేనెందుకు వినాలి?'' అన్నది తల్లి కటువుగా.

రాము కుక్కపిల్లకేసి దీనంగా చూస్తూ వెక్కివెక్కి ఏడ్వసాగాడు. కుక్కపిల్ల వాడి చుట్టూ మళ్ళీ మళ్ళీ తిరుగుతూ, మీదపడి పొర్లుతూ వాణ్ణి ఓదార్చడానికి నానా తంటాలు పడసాగింది. రాము ఆ రాత్రి తల్లిపెట్టిన అన్నం కూడా తినకుండా అలాగే నిద్రపోయాడు. కుక్కపిల్ల కూడా గదిలో ఒక మూలగా ముడుచుకుని పడుకున్నది.

మరునాడు వేకువజామున కళ్ళాపి చల్లి, ఇంటిలోపలికి వచ్చిన రాము తల్లికి అక్కడి దృశ్యం ఆశ్చర్యం కలిగించింది. అప్పటికే నిద్ర లేచిన రాము, పడుకున్న చాపను చుట్టి పక్కన పెట్టి, "అమ్మా, ఈ రోజు మన సమీర, తన పళ్ళతో నేను కప్పుకున్న దుప్పటిని పట్టి లాగి నన్ను నిద్రపోనివ్వకుండా చేసి లేపింది. ఇదేవిధంగా నన్ను రోజూ నిద్రలేపుతుంది. ఆలస్యం కాకుండా బడికి వెళతాను. నన్ను నిద్రలేపే పనికూడా నీకు ఉండదు. అలా అయినప్పుడు సమీర మనతోనే ఉండవచ్చు కదా!'' అన్నాడు బతిమాలుతున్నట్టు.

"అలాగే రామూ! తెల్లవారకముందే నువ్వు నిద్ర లేస్తే చాలు. కుక్కపిల్లను మన ఇంట్లోనే ఉంచుకుందాం,'' అన్నది రాము తల్లి చిన్నగా నవ్వుతూ.

పెంపుడు జంతువులు తమను ఆప్యాయంగా పెంచే వాళ్ళ ప్రవర్తనలో వచ్చే చిన్న మార్పునైనా సరే ఇట్టే పసిగట్టగలవని రాము తల్లితోపాటు రాముకూ అర్థమయింది.

సమస్య తీరడంతో రాము కళ్ళు ఆనందంతో మెరిశాయి. సమీరను ఆప్యాయంగా దగ్గరికి తీసుకున్నాడు.



## ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

'చాచా నెహ్రూ'గా పిల్లల ప్రేమకు పాత్రుడైన భారత తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ 1889 నవంబర్ 14వ తేదీ అలహాబాదులో జన్మించాడు. నెహ్రూ పిల్లల పట్ల కనబరచిన అపారప్రేమాభిమానాల కారణంగా 1957వ సం॥ నుంచి ఆయన జన్మ దినాన్ని బాలలదినోత్సవంగా జరుపుకుంటున్నాము.

జవహర్‌లాల్ తండ్రి మోతిలాల్ నెహ్రూ సుప్రసిద్ధ న్యాయవాది. భారత జాతీయ కాంగ్రెస్ నాయకుడు. ఆయన తన ఏకైక కుమారుడైన జవహర్‌ను 14వ యేట వరకు ఇంట్లోనే చదివించాడు. ఆ తరవాత లండన్ సమీపంలోని హారో స్కూలుకు పంపాడు.



# జవహర్ లాల్ నెహ్రూ

జవహర్‌లాల్ కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడై బార్ - అట్-లా పూర్తిచేసి 1912వసం॥లో స్వదేశానికి తిరిగివచ్చాడు.

ఆయన న్యాయవాద వృత్తిని పక్కనబెట్టి, రాజకీయ రంగంలో ప్రవేశించాడు. 1916వసం॥లో ఆయన జీవితంలో రెండు ముఖ్యమైన సంఘటనలు జరిగాయి. ఒకటి, కమలాదేవితో వివాహం. రెండు, లక్నో మహాసభలో గాంధీజీని దర్శించడం. నెహ్రూపై గాంధీజీ ప్రభావం జీవితాంతం కొనసాగింది.

1913వ సం॥ఏప్రిల్ 13వ తేదీ అమృతసర్ సమీపాన జలియన్‌వాలాబాగ్‌లో – బ్రిటిష్ అధికారి డైయర్ నాయకత్వంలో బ్రిటిష్ సైనికులు దాదాపు నాలుగు వందల మంది అమాయక ప్రజలను హింసించి చంపారు. పదిహేను వందలకు పైబడిన వారిని గాయపరచారు. దేశబంధు చిత్తరంజన్‌దాస్, గాంధీజీ, నెహ్రూ ఈ దురాగతాల గురించి వివరాలు సేకరించి, ఇండియాలో బ్రిటిష్ పాలనను అంతం చేయడానికి బద్ధకంకణులయ్యారు.

1928 వ సం॥ లో నెహ్రూ భారత జాతీయ కాంగ్రెస్ ప్రధానకార్యదర్శి అయ్యాడు. మరు సంవత్సరం దాని అధ్యక్షుడయ్యాడు. సహాయనిరాకరణోద్యమానికి అధ్యక్షత వహించి జైలుకు వెళ్ళడం; కాంగ్రెస్‌కు నాయకత్వం వహించి పోరాటం జరిపి మళ్ళీ జైలుకు వెళ్ళడం అంటూ నిర్విరామ ప్రజా పోరాటంగా సాగింది నెహ్రూ రాజకీయజీవితం.

1931లో ఆయన తండ్రి మరణించాడు. ఆ తరవాత భార్య మరణించింది. 1938లో ఆయన తల్లి స్వరూపరాణి మరణించింది.

1947వ సం॥ లో ఆయన స్వతంత్రభారతదేశ ప్రధానమంత్రి పదవీ భాధ్యతలు చేపట్టాడు. 1964వ సం॥మే 27వ తేదీ మరణించేంతవరకు పదిహేడేళ్ళు ఆ పదవిని సమర్థవంతంగా నిర్వహించి మన దేశ ఆర్థిక, రాజకీయ, సామాజిక ప్రగతికి పాటుపడ్డాడు.

20వ శతాబ్దంలో గొప్ప రాజనీతివేత్తగా పేరుగాంచిన నెహ్రూ ప్రపంచశాంతికి కృషి చేశాడు. ఆయన గొప్ప రచయితగానూ, వక్తగానూ పేరుగాంచాడు. ఆయన జైలులో ఉన్నప్పుడు తన కుమార్తె ఇందిరాప్రియదర్శినికి రాసిన లేఖలు 'గ్లింప్సస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ' (ప్రపంచ చరిత్ర) అనే గ్రంథంగా వెలువడి పాఠకుల మన్ననలు పొందింది. ఆయన రచించిన 'స్వీయచరిత్ర', 'భారతదర్శనం' పుస్తకాలు కూడా ముఖ్యమైనవిగా విజ్ఞుల ప్రశంసలను అందుకున్నాయి.





ప్రియమైన మిత్రులకు,

నమస్కారం! బాలలకు అంకితమైన నవంబర్ నెల సంచికలో ఈ ప్రత్యేక విభాగాన్ని సమర్పిస్తున్నందుకు చందమామ చాలా సంతోషిస్తున్నది.

యావత్ భారతదేశానికి చెందిన బాలబాలికలు రచించిన కొన్ని కథలను మీరీ విభాగంలో చదవనున్నారు. 'బాలరచయితలకు – చిత్రకారులకు ఆహ్వానం!' పోటీలకు వచ్చిన ఎంట్రీలనుంచి ఈ కథలను ఎంపిక చేయడం జరిగింది.

ఆ కథలకు దేశంలోని వివిధ ప్రాంతాలనుంచి బాలచిత్రకారులను రప్పించి వారిచేత చిత్రాలు వేయించాం.

ఈ ప్రత్యేక విభాగానికి రచనలు/చిత్రాలు పంపి విజయం సాధించిన బాలరచయితలకూ, చిత్రకారులకూ హృదయపూర్వక అభినందనలు తెలియజేస్తున్నాము. వీరు తమ కృషిని కొనసాగిస్తూ మునుముందు మంచి రచయితలుగా, చిత్రకారులుగా పేరుతెచ్చుకోవాలని శుభాకాంక్షలు తెలియజేస్తున్నాము.

ఈ పోటీలకు ఎంట్రీలు పంపి, ఎంపిక కానివారు నిరుత్సాహపడనవసరం లేదు. ఎందుకంటే వచ్చిన వాటిలో చాలావరకు బాగానే ఉన్నాయి. ఉత్తమమైనవాటిని ఎంపిక చేయడానికి చాలా శ్రమపడవలసి వచ్చింది. మునుముందు జరుగనున్న పోటీలలో మీరూ విజేతలు కావచ్చు! ఈ పోటీలలో పాల్గొనాలని ఆసక్తి వున్నప్పటికీ, పరీక్షలూ, ఇతరేతర కారణాల వల్ల పాల్గొనలేకపోయిన యువమిత్రులు కూడా నిరుత్సాహపడనవసరం లేదు. ఎందుకంటే – ఇలాంటి సదవకాశాలు భవిష్యత్తులో మళ్ళీ మళ్ళీ కల్పించాలని మేము ఆశిస్తున్నాము.



బాలల రచనలు – చిత్రాలతో పాటు ఈ ప్రత్యేక సంచికలో పిల్లల అభిమాన దీపాల పండుగ దీపావళికి సంబంధించిన కథలు, విశేషాలు చాలా ఉన్నాయి. మనం దీపావళిని ఎందుకు జరుపుకుంటున్నాం? దీనిని దేశంలోని ఏఏ ప్రాంతాలలో ఎలా ఎలా జరుపుకుంటున్నారు? ఆయా ఆచారాలూ, సంప్రదాయాలూ ఏర్పడడానికి గల కారణాలేమిటి? మనం దీపావళి పండుగ జరుపుకున్నట్టే చైనాలోనూ లాంతరు-బాణాసంచా పండుగ జరుపుకుంటారట. మరి దానికి సంబంధించిన విశేషాలేమిటి? ఇలా దీపావళి ప్రాముఖ్యతను తెలియజేసే ఆసక్తికరమైన అనేక రచనలు, అందమైన చిత్రాలతో ఈ విభాగాన్ని అలంకరిస్తున్నాయి.

ఈ విశేషాలన్నిటినీ ఒకే చోట గుదిగుచ్చడంలో మేము పొందిన ఆనందాన్ని, వాటిని చదవడంలో మీరూ పొందగలరని ఆశిస్తున్నాము.

మీ ప్రియమైన,
విశ్వం, సంపాదకుడు.

# అదృష్ట పతకం!

Anjul Luniya, Maharashtra

రచన : నిత్య త్రిపురనేని, యు.ఎస్.ఏ

హిమాలయాలకు సమీపంలోని గంగాపూర్ గ్రామంలో నీనా అనే అమ్మాయి నివసిస్తూండేది. నీనాకు శ్వేత అనే ఒక చెల్లెలు ఉంది. తల్లి అనారోగ్యం కారణంగా ఇంటిలో పనులన్నీ అక్కా చెల్లెళ్ళే చేసుకుంటూ వంట కూడా చేసేవారు.

నీనా తల్లి పడుకుని పిల్లలకు పనులు పురమాయిస్తూ, వైద్యులు చెప్పినట్టు మందులు వాడుతూ, సంగీతం వింటూ పొద్దుపుచ్చుతుంది.

నీనా ఒకనాడు అడవి సమీపంలో చెట్టు మీది పళ్ళకోసం వెతుకుతూండగా, దాపుల వున్న చెట్టుకొమ్మ నుంచి ఒక వింత వెలుగు ఆమె ముఖం మీదపడింది. ఆమె ఏమిటా అని దగ్గరికి వెళ్ళి చూసింది. అక్కడొక పతకం హారానికి వేలాడుతూ కనిపించింది. నీనా తీసి చూసింది. అది గుండె ఆకారంలో వుంది. బంగారు పూతపూయడం వల్ల ఎండకు తళతళా మెరుస్తున్నది. ఆమె ఆ పతకాన్ని ఉత్సాహంగా తెరిచి చూసింది. కానీ, లోపల ఏమీ లేదు. ఆ తరవాత ఆమె దానిని జాగ్రత్తగా మూసి, చొక్కా జేబులో భద్రపరిచింది.

పళ్ళబుట్టతో ఇంటికి వచ్చిన నీనా పళ్ళను వంటగదిలో వుంచింది. ఆ రోజు ఆమె చెల్లెలు శ్వేతకు ఏడవ పుట్టినరోజు. అందువల్ల ప్రత్యేకంగా కొన్ని పిండివంటలు చేసింది. పని చేస్తూన్నంత సేపూ అడవిలో తనకు దొరికిన పతకం మెరుస్తూన్నదన్న సంగతి నీనాకు తెలియదు. వంట చేయడం వల్ల ఆమె బాగా అలిసిపోయింది.

భోజన సమయంలో వంటలు బావున్నాయని అందరూ మెచ్చుకోవడంతో నీనా అలసట మటుమాయమైంది. ఆమె మనసు సంతోషంతో నిండిపోయింది.

ఆ తరవాత అక్కాచెల్లెళ్ళు శ్వేతకు వచ్చిన పుట్టిన రోజు కానుకలు పరిశీలించడం ప్రారంభించారు. నక్షత్రాలబొమ్మల కాగితంలో చుట్టిన పెట్టెను మొదట విప్పి చూసింది శ్వేత. లోపల అందమైన 'అంజలి' బొమ్మ. శ్వేతకు అదంటే మహాఇష్టం. ఆ పెట్టెకు వేలాడుతూన్న చీటీని చూసి అది తన తల్లి కానుక అని శ్వేత గ్రహించింది. ఆమె తన కోసం పొదుపుచేసిన డబ్బుతో బొమ్మను

కొన్నదన్నమాట. ''అమ్మా! చాలా కృతజ్ఞతలు,'' అన్నది శ్వేత ఆనందంతో. ఆ తరవాత, '' ఇది చాలా ఖరీదయింది కదా? దీనికోసం నువ్వు ఇంత శ్రమపడి వుండనవసరం లేదేమో!'' అన్నది కాస్త బాధగా.

''నా పిల్లలకోసం నాకేదీ శ్రమా కాదు; ఎక్కువా కాదు,'' అంటూ ఆమె తల్లి శ్వేతను ఆప్యాయంగా కౌగిలించుకున్నది.

గులాబీ బొమ్మల కాగితంలో చుట్టిన మరొక కానుకను తీసింది శ్వేత. గులాబీలంటే ఆమెకు చాలా ఇష్టం. ఆమె ఆ పెట్టెను తెరిచింది. లోపల అందమైన చెక్కడాలలో సంగీతపేటిక!


Anjul Luniya, Maharashtra

అది నీనా కానుక!

''చాలా సంతోషం అక్కయ్యా! దీన్ని నేను జాగ్రత్తగా చూసుకుంటాను,'' అన్నది శ్వేత అమితానందంతో.

నీనా చిన్నగా నవ్వుతూ, ''ఇదిగో చూడు, ఈ తాళానికి వున్న చిన్న చెవిని కొద్దిగా ఎడమవైపుకు తిప్పితే చాలు. పేటిక తెరుచుకుంటుంది. దీనిపై నీకు కావలసిన స్వరాన్ని పలికించవచ్చు. దీనిని ఎలా తెరవాలో ఎవరికీ చెప్పొద్దు. నువ్వు కూడా దీనిని చీటికీ మాటికీ తెరవకూడదు,'' అన్నది.

''అలాగే. జాగ్రత్తగా చూసుకుంటాను,'' అన్నది శ్వేత.

మరొక పెట్టెకు వేలాడుతూన్న చీటీని చూసింది శ్వేత. అది తాతయ్య పంపింది. దాని పక్కనే వున్నది నాన్నగారి కానుక. శ్వేత ఆ పెట్టెను ఉత్సాహంగా తెరిచింది. గుండె ఆకారంలో వున్న పతకంలో వున్న బంగారు గొలుసు. అది అచ్చం నీనాకు పొద్దున అడవిలో దొరికిన పతకంలాగే ఉన్నది. శ్వేత పతకాన్ని తెరిచిచూసింది. అందులో నీనా, శ్వేత, తల్లి, తండ్రి బొమ్మలు ఉన్నాయి. శ్వేత ఆ పతకహారాన్ని జాగ్రత్తగా మెడలో వేసుకున్నది. దాంతో ఆమె ముఖానికి కొత్త కళ వచ్చింది.

ఇంకా తెరవకుండా వున్న ఆఖరి కానుక కలువపూల బొమ్మలతో అలంకరించబడివుంది. ఆ పూలన్నా శ్వేతకు చాలా ఇష్టం. ఆమె నెమ్మదిగా పెట్టె తెరిచింది. అందులో గాజుతో చేసిన డాల్ఫిన్ బొమ్మ కనిపించింది. డాల్ఫిన్ అంటే శ్వేతకు ప్రాణం. ఆమె దానిని జాగ్రత్తగా తీసి, ముద్దుపెట్టుకుని తల్లి చేతికిచ్చింది. ఆమె దానిని తీసుకుపోయి శ్వేత గదిలో అమర్చింది.

ఆ తరవాత నీనా, శ్వేత నిద్రకు సిద్ధమయ్యారు. నీనా పతకాన్ని జాగ్రత్తగా నగల పెట్టెలో పెట్టి, భద్రపరిచింది.

''ఈరోజు చాలా ఆనందమైన రోజు కదూ!'' అని అడిగింది శ్వేత పడుకోబోతూ.

''అవును శ్వేతా. మరపురాని మహా ఆనందకరమైన రోజు,'' అంటూ దుప్పటిని లాక్కున్నది నీనా.

నిద్రతో కనురెప్పలు మూతపడుతూండగా – తనకు ఉదయం అడవిలో దొరికిన అందమైన పతకం వల్లే ఈ రోజంతా ఆనందంగా గడిచిందేమో అనుకున్నది నీనా. నిజంగా అది తన అదృష్టపతకమే అనుకుంటూ నీనా హాయిగా నిద్రపోతూ కమ్మని కలలు కనసాగింది. ★

# సహనం

రచన : శీతల్ డి. వడగావే, సతారా, మహారాష్ట్ర

అనిల్, సునీల్ అన్నదమ్ములు. పేదవాళ్ళు గనక ఉచిత వసతిగృహంలో వుంటూ చదువుకుంటున్నారు. తాము పేదవాళ్ళయినప్పటికీ బాగా చదువుకుని జీవితంలో పైకి రావాలనే తపన, పట్టుదల వాళ్ళకు ఉండేది. అందువల్ల పాఠశాల అయిపోగానే సాయంకాలం కొట్లలో పనిచేసి కొంత సంపాయించి, దాంతో ఫీజులు చెల్లించేవారు. అయితే ఒక నెల తగిన సంపాదన లేక ఫీజు కట్టలేని పరిస్థితి ఏర్పడింది. బడి మానేద్దామా అని కూడా ఆలోచించారు. ఆఖరికి నగరంలో వున్న తమ మామయ్య ఆస్తిపరుడన్న విషయం వాళ్ళకు జ్ఞాపకం వచ్చింది. ఆయన్ను సాయం అడగాలనుకున్నారు.

తమ అవసరాన్ని తెలియజేస్తూ ఐదు వందల రూపాయలు పంపమని మామయ్యకు ఉత్తరం రాశారు. వాళ్ళ మామయ్య మంచి మనిషి. ఒకవారం లోగా వాళ్ళకు ఆయన నుంచి వంద రూపాయలు మనిఆర్డర్ వచ్చింది.




ఆ చిన్న మొత్తాన్ని చూడగానే సునీల్‌కు చాలా బాధ కలిగింది. ''మామయ్య, రోజూ ఇంత కన్నా ఎక్కువే తన కారు పెట్రోలుకు ఖర్చు పెడుతూ వుంటాడు. అవసరంలో వున్న మనకు ఇవ్వడానికి ఆయనకు మనసు రావడం లేదు. ఆ ముష్టిడబ్బు పంపక పోతే మాత్రం ఏం? దీనిని ఇప్పుడే తిప్పి పంపేద్దాం, లేకుంటే జీవితాంతం ఆ పెద్దమనిషికి మనం ఋణపడివుండవలసి వస్తుంది!'' అన్నాడు కోపంగా.

పెద్దవాడైన అనిల్ అంత ముక్కోపి కాదు. అందువల్ల తొందరపాటు నిర్ణయం తీసుకోవద్దనీ, ఒక్కరోజు ఆగమనీ తమ్ముడికి సలహా ఇచ్చాడు.

సాయంకాలానికి సునీల్ కోపం తగ్గింది. తాను డబ్బు తిప్పిపంపక పోవడమే మంచిదనిపించింది.

మరునాడు ఉదయం అనిల్, ''కోపంతో డబ్బును తిప్పి పంపాలనుకున్నావే అది చాలా పొరబాటు. మన మామయ్య చాలా మంచివాడు. కరుణా హృదయుడు. ఒక్క కార్డు ముక్క రాసేస్తే వంద రూపాయలు మనకు ఎవరు పంపగలరో ఆలోచించు. మనం ఆయన్ను చూసి ఎన్నాళ్ళయిందో తెలుసా? అయినా మనం అడిగిన వెంటనే డబ్బు పంపడం దొడ్డగుణం కాదా?'' అన్నాడు.



''అలాగా!'' అన్నాడు సునీల్ మెల్లగా.

''అవును. పైగా వందరూపాయలు మనకు తక్కువ మొత్తమేం కాదు. దానిని సంపాయించాలంటే మనం కొన్ని వారాలు అంగళ్ళలో పనిచేయాలి. ఇప్పుడీ సాయాన్ని మనం సక్రమంగా వినియోగించుకున్నామంటే భవిష్యత్తులో మామయ్య మరింత సాయం చేయగలడన్న నమ్మకం నాకున్నది. ఆ సహాయం పొందే అర్హతను మనం పెంపొందించుకోవాలి,'' అన్నాడు అనిల్.

సునీల్‌కు అన్న మాటల్లో నిజం ఉన్నట్టు అనిపించింది. ఆ డబ్బుతో ఫీజు చెల్లించారు. ఆ సంవత్సరం చక్కగా చదివి మంచి మార్కులతో ఉత్తీర్ణులయ్యారు.

సమయానికి డబ్బు పంపి ఆదుకున్నందుకు మామయ్యకు కృతజ్ఞతలు తెలియజేస్తూ అనిల్ ఉత్తరం రాశాడు. దాంతో తాము పరీక్షల్లో సంపాయించిన మార్కుల జాబితాను కూడా జతచేశాడు. దానిని చూడగానే వాళ్ళ మామయ్య సంతోషంతో పొంగిపోయాడు. ఈ కాలం పిల్లల్లో ఇంత వినయమా అని ఆశ్చర్యపోయాడు. తన మేనల్లుళ్ళ కృతజ్ఞతాబుద్ధిని తలుచుకుని మురిసిపోయాడు. వెంటనే ఆయన వాళ్ళకు మూడు వేల రూపాయలు పంపుతూ, బాగా చదవమనీ, పైచదువులకు సాయం చేయడానికి తాను సిద్ధంగా ఉన్నాననీ తెలియజేశాడు.

ఆ డబ్బునూ, ఉత్తరాన్నీ చూడగానే వారిద్దరికీ పట్టరాని ఆనందం కలిగింది. ఇద్దరూ దీక్షగా చదువుకున్నారు.

కొన్నాళ్ళకు అన్నయ్య అనిల్ డాక్టరయ్యాడు. తమ్ముడు సునీల్ ఇంజనీరయ్యాడు. ★



# సుమిత్రుడి తెలివి

రచన : జి.కె. ప్రసాద్, ఆం.ప్ర.




కౌశిలిక రాజ్యాన్ని సునందుడనే రాజు పాలించేవాడు. అది చిన్న రాజ్యం కావడం వల్ల, ఇరుగు పొరుగు రాజులు చీటికి మాటికి కయ్యానికి కాలు దువ్వేవారు. రాజ్యంలోని ధనరాసులను కొల్లగొట్టుకునిపోయేవారు. రాజ్యాన్ని ఆక్రమించుకోవాలని ప్రయత్నించేవారు.

పరాక్రమవంతుడైన రాజు సునందుడు మూడు సార్లు శత్రుసేనలను ఎదురొడ్డి నిలిచి, రాజ్యాన్ని కాపాడుకున్నాడు. కాని యుద్ధాల కారణంగా రాజ్యం ఆర్థికంగా చితికిపోయింది. ప్రజలు కరువు కాటకాలతో బాధపడసాగారు. ఈ కష్టాల నుంచి ప్రజలను కాపాడడం ఎలాగా అని రాజు ఆలోచిస్తూండగా వృద్ధ మంత్రి, ''ప్రభూ! మీ తండ్రిగారి కాలంలో మన రాజ్యంపై దండెత్తి వచ్చిన కౌండిన్యదేశపు రాజులు మనదేశంలోని నిధి నిక్షేపాలను కొల్లగొట్టి వాటిని తమ దేశం వరకు తరలించలేక మనదేశ ఉత్తర సరిహద్దులో వున్న అరణ్యమధ్యంలోని గుహలో దాచి వెళ్ళారు. ఆ తరవాత మళ్ళీ తిరిగిరాలేదు. ఆ నిధులను తెచ్చుకుంటే మన సమస్యలన్నీ తీరిపోతాయి,'' అన్నాడు.

''ఆ నిధులకోసమని ఆ గుహలోకి వెళ్ళిన వారెవరూ తిరిగిరాలేదన్న విషయం మీకు తెలిసినదే కదా?'' అన్నాడు సునందుడు.

''నిజమే, ప్రభూ! అయినా ఇది చాలా కాలం నాటి మాట. ఇప్పుడు ఆ గుహలోకి వెళ్ళి నిధులను వెలికి తెచ్చిన వీరుణ్ణి మన రాజ్యానికి యువరాజును చేద్దామని చాటింపు వేయిద్దాం. మీకూ సంతానం లేదు గనక, మంచి వారసుణ్ణి ఎంపికచేసే అవకాశం కూడా లభిస్తుంది,'' అన్నాడు మంత్రి.

మంచి ఆలోచన అని చెప్పి, రాజు అలాగే చాటింపు వేయించాడు.

ఒక వారం గడిచాక, సుమిత్రుడనే యువకుడు రాజదర్శనానికివచ్చాడు. తాను ఆ నిధులను వెలికితేవడానికి ప్రయత్నించగలననీ, అందుకోసం ప్రసవించడానికిసిద్ధంగా వున్న పది నిండు చూలు గుర్రాలు తనకు కావాలనీ చెప్పాడు.

రాజు అలాగే పది చూటిగుర్రాలను ఇప్పించాడు. సుమిత్రుడు వాటిని కొన్ని రోజులు మేపి, అవి ప్రసవించనున్న సమయంలో అడవిలోని గుహ ముఖద్వారం దగ్గరికి తోలుకుపోయాడు.

గుర్రాలు ప్రసవించాక గుర్రపు పిల్లలను గుహ ముఖద్వారంవద్ద వదిలి భటులను కాపలావుంచాడు. తానొక కాగడా చేతపట్టుకుని పది గుర్రాలను గుహ లోపలికి తోలుకుపోయాడు.

గుహలో ఎక్కడ చూసినా మానవ కళేబరాలు, అస్థిపంజరాలు కనిపించాయి. అంతకు ముందు నిధులను తరలించడానికి వచ్చిన వారందరూ చిమ్మ చీకటిగా వున్న గుహనుంచి వెలుపలికి వచ్చే దారి తెలియక ఆ గుహలోనే చిక్కుకుని అన్న పానీయాలు లేక మరణించారని సుమిత్రుడు గ్రహించాడు.

ఇంకా కొంత దూరం లోపలికి వెళ్ళాక ధన రాసులు, బంగారు ఆభరణాలు కనిపించాయి. కాగడా వెలుగులో వాటిని వెంటతెచ్చుకున్న సంచులలో నింపి, గుర్రాలపై వేశాడు. అంతలో చేతిలోని కాగడా ఆరిపోయింది. చుట్టు గాఢాంధ కారం కమ్ముకున్నది. సుమిత్రుడు ఒక గుర్రం మీద ఎక్కి కూర్చున్నాడు. అతడు ఊహించినట్టే ఆడగుర్రాలు అటు ఇటూ తిరిగి, వాసన ద్వారా తమ పిల్లల జాడను పసికడుతూ గుహ వెలుపలికి వచ్చేశాయి.

అపారనిధులతో వచ్చిన సుమిత్రుడికి రాజు ఘనస్వాగతం పలికాడు. ''గుహ లోకి వెళ్ళిన వారెవరూ తిరిగి రాలేదు కదా? మరి నువ్వెలా నిధులతో క్షేమంగా తిరిగిరాగలిగావు?'' అని అడిగాడు పక్కనే వున్న మంత్రి సుమిత్రుణ్ణి.

''ఆడగుర్రాలు వాసన ద్వారా తమ పిల్లల జాడను పసిగట్టగలవని పెద్దలు చెప్పగా విన్నాను. అందు వల్లే రాజుగారిని ప్రసవించనున్న పది గుర్రాలను ఇవ్వమని అడిగాను. గుహలో చిమ్మ చీకటిగా వున్నా ఆ గుర్రాలన్నీ వాసన ద్వారానే తమ పిల్లలున్న చోటును తెలుసుకుని వచ్చేశాయి. ఒక గుర్రం మీద ఎక్కిన నేను సురక్షితంగా వెలుపలికి వచ్చేశాను,'' అన్నాడు సుమిత్రుడు.

మంత్రి ఆ సమాధానం విని ఎంతో సంతో షించాడు.

రాజ్యం కోసం ప్రాణాలకు తెగించి, సాహసంతో పాటు తెలివిని కూడా ప్రదర్శించిన సుమిత్రుణ్ణి, రాజు యువరాజుగా ప్రకటించాడు.

అప్పటినుంచి కౌశిలిక రాజ్య ప్రజలు ఆర్థిక బాధలూ, శత్రు భయమూ లేకుండా సుఖశాంతు లతో జీవించారు. ★



Pritam Das, West Bengal

# నిజమైన సంతోషం

రచన : అనుభవ్ మౌర్య, యు.పి.

దీపావళి దగ్గర పడుతున్న కొద్దీ రాజీవ్ మనసు ఉత్సాహంతో ఉరకలు వేయసాగింది. గత యేడాదిలాగే ఈ సంవత్సరం కూడా అతడు టపాకాయల అంగడి పెట్టాడు. అతను అమ్మే టపాకాయలు నాణ్యమైనవి గనక, వ్యాపారం బాగా జరుగుతుంది.

గత సంవత్సరం ఇలాగే అంగడి పెట్టి ఎనిమిది వందలు లాభం సంపాయించాడు. ఆ డబ్బుతో పుస్తకాలు కొనుక్కున్నాడు; తనకూ తన చెల్లెలికీ స్కూలు ఫీజు కట్టాడు; మిగిలిన డబ్బును తల్లిదండ్రుల చేతిలో పెట్టాడు. దానిని చూసి వాళ్ళెంతగానో సంతోషించారు. అందువల్ల ఈ సంవత్సరం కూడా మరింత ఉత్సాహంతో కొట్టు ఆరంభించాడు.




Agni Chemburkar, Maharashtra

ఐదారు నెలల క్రితం రాజీవ్ తండ్రికి జబ్బు చేసింది. ఆయనకు వైద్యం చేయించడానికి ఉన్న పొలం కూడా అమ్ముకోవలసివచ్చింది. దాంతో కుటుంబ ఆదాయం బాగా తగ్గిపోయింది.

ఇవన్నీ రాజీవ్ మనసుకు కష్టం కలిగించాయి. అయినా, పట్టుదలగా చదువుకుంటూ కుటుంబ భారాన్ని తాను కూడా కొంత మోయడానికి సిద్ధపడ్డాడు. తాను చదువుకుంటూ, చిన్నపిల్లలకు ట్యూషన్లు చెబుతూ నెలనెలా కొంత సంపాయించసాగాడు. అది అతని కుటుంబానికి ఎంతో ఉపయోగంగా ఉండేది. ఇప్పుడు తండ్రి ఆరోగ్యం కూడా కుదుటపడింది.

ఇంటి పరిస్థితులు చక్కబడడంతో రాజీవ్, ఈ సంవత్సరం మరికాస్త పెద్ద కొట్టు పెట్టగలిగాడు. మొదటిరోజే అయిదు వందల రూపాయలు లాభం వచ్చింది. దీపావళికి ఇంకా మూడు రోజులు ఉన్నాయి. మరునాడు అతడు అంగడి తెరవకముందే టపాకాయలు కొనడానికి జనం వచ్చారు. రాజీవ్ విశ్రాంతి లేకుండా వ్యాపారం చేశాడు.

ఆ రాత్రి బాగా పొద్దుపోయాక రాజీవ్ కొట్టుకట్టేసి డబ్బును సంచిలో వేసుకుని ఇంటికి బయలుదేరాడు. మార్గమధ్యంలో ఒక ఇంటినుంచి పిల్లల ఏడుపు విని

పించింది. రాజీవ్ అక్కడికి వెళ్ళిచూశాడు. ముగ్గురు పిల్లలు తల్లిని టపాకాయలు కొని పెట్టమని అడుగుతూ ఏడుస్తున్నారు. పేద రాలైన ఆ తల్లి పిల్లలను సముదాయించ డానికి ప్రయత్నిస్తోంది. రాజీవ్ మెల్లగా వెను దిరిగాడు. ''ఈ టపాకాయల వ్యాపారం ద్వారా సంపాయించకపోతే నేను కూడా ఇలాగే బాధపడేవాణ్ణి కదా! ఈ పిల్లలకు సాయం చేయాలి,'' అనుకుంటూ ఇంటి దారిపట్టాడు.

ఇల్లు చేరగానే నాన్నకు ఈ సంగతి చెప్పాడు. ఆయన అలాగేసాయం చేయమన్నాడు.

మరునాడు కొట్టుకు వెళ్ళాడు. సాయంకాలానికల్లా వ్యాపారం పూర్తయింది. రాజీవ్ వాళ్ళకని పక్కన ఉంచిన టపాకాయలు సంచిలో వేసుకుని, పక్కన తిను బండారాలు కొనుక్కుని ఆ పేదరాలి ఇంటికి బయలు దేరాడు. అడుగుపై కూర్చున్న ఆమె పాదాలు తాకి నమస్కరించి, సంచీని ఆమెకు అందించాడు.

ఆ పేదరాలు విస్మయంతో కొంత సేపు మాట్లాడలేకపోయింది. ఆ తరవాత, ''ఏమిటి బిడ్డా ఇవన్నీ? ఇంతకూ నువ్వెవరు?'' అని అడిగింది.

''నిన్న ఈ దారిగుండా వెళుతూ మీ పిల్లలు ఏడ్వడం చూసి భరించలేకపోయాను. న్నను బిడ్డాఅని పిలిచావు కదా? మరి బిడ్డ తల్లికి సాయపడడంలో ఆశ్చర్యమేముంది? అందువల్ల దయచేసి నామాట విని వీటిని వద్దనకుండా తీసుకో,'' అన్నాడు రాజీవ్.

ఆ పేదరాలి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ''నాయనా! నీలాంటి ఉత్తముణ్ణి కన్న నీ తల్లి


*Agni Chemburkar, Maharashtra*

ధన్యురాలు. నిన్ను బిడ్డగా పొందడానికి ఎవరైనా ఆనందిస్తారు. నీ మనసు గొప్పది,'' అంటూ రాజీవ్ తలపై చేయివుంచి వాత్స ల్యంతో దీవించింది.

అప్పుడే ఆమె ముగ్గురు పిల్లలూ అక్కడికి వచ్చారు. టపాకాయలూ, స్వీట్లూ చూడగానే వాళ్ళ ఆనందానికిహద్దులు లేకుండాపోయాయి. పిల్లల నవ్వుముఖాలు చూడగానే రాజీవ్ ఎంతో సంతోషించారు. తృప్తిగా ఇంటికేసి నడవ సాగాడు. ★



# లోకం తీరు!

రచన : మొహమ్మద్ షిరాజ్, ఆం.ప్ర.

ఒకానొకప్పుడు ఒక కుర్రవాడు రోజూ తన గ్రామం నుంచి చిన్న అడవిగుండా వెళ్ళి, పొరుగుగ్రామంలో వున్న బడిలో చదువుకుని వచ్చేవాడు. అలా ఒక నాటి సాయంకాలం వాడు తిరిగివస్తూండగా, ఒక కొలను సమీపం నుంచి,'' కాపాడండి, కాపాడండి!'' అన్న మొసలి కంఠస్వరం వినిపించింది.

''నీకు వచ్చిన కష్టం ఏమిటి?'' అని అడిగాడు కుర్రవాడు దూరం నుంచే.

''ఒక వలలో తగులుకున్నాను. నన్ను కాపాడు,'' అన్నది మొసలి కన్నీళ్ళు కారుస్తూ.

''నీ దగ్గరికి వస్తే చంపేస్తావు కదా?'' అని అడిగాడు కుర్రవాడు.

''చంపను. నన్ను నమ్ము. దగ్గరికి వచ్చి విడిపించు,'' అన్నది మొసలి.

కుర్రవాడు దాన్ని సమీపించగానే అది వాణ్ణి కోరలతో పట్టి మింగబోయింది.

''ఇదా నువ్వు చూపే కృతజ్ఞత?'' అన్నాడు కుర్రవాడు.

''అవును, ఇదే లోకంతీరు!'' అన్నది మొసలి.

''ఇది లోకం తీరు కాదు. నేను నమ్మను,'' అన్నాడు కుర్రవాడు.

''సరి, నువ్వే చూడు. ఈ దారిన వచ్చే మొదటి ముగ్గురిని లోకంతీరు గురించి అడుగుదాం. నేను చెప్పింది నిజమయితేనే నేను నిన్ను మింగుతాను. లేకుంటే వదిలిపెడతాను,'' అన్నది మొసలి.

మొట్టమొదట ఆ దారిన ఒక ముసలి గాడిద వచ్చింది. మొసలి తన సమస్యను చెప్పింది.

''అవును. నేను వయసులో చాకిరి చేసినంత కాలం నన్ను పోషించి, వయసు ఉడిగిపోగానే నా యజమాని నన్ను తరిమేశాడు. లోకం తీరే అంత!'' అంటూ గాడిద వెళ్ళిపోయింది.

ఆ తరవాత అటువైపు వచ్చిన గుర్రం కూడా అదేఅభిప్రాయంవెలిబుచ్చింది.

మూడవదిగా ఒక కుందేలు అటువైపు వచ్చింది. మొసలి తనసమస్యను చెప్పింది. అంతా విన్న కుందేలు, ''అసలు ఇక్కడ జరిగిందేదో మొదటి నుంచీ కళ్ళారా చూస్తే తప్ప, నేను ఒక నిర్ణయానికి రాలేను,'' అన్నది.

మొసలి తన పళ్ళసందు నుంచి కుర్రవాణ్ణి వదలిపెట్టింది. కుర్రవాడు బయటపడగానే, ''మీ గ్రామస్థులకు మొసలి మాంసం అంటే ఇష్టం లేదా?'' అని అడిగింది కుందేలు.

''ఎందుకులేదూ?'' అన్నాడు కుర్రవాడు.

''అయితే వెళ్ళి వాళ్ళకు సంగతి చెప్పు,'' అంటూ కుందేలు చెట్టు నీడకు వెళ్ళింది.

కుర్రవాడు పరిగెత్తుతూ వెళ్ళి, కొంతసేపటికి ఆయుధాలతో గ్రామస్థులను వెంటబెట్టుకు



PritamDas, West Bengal

వచ్చాడు. అయితే, గ్రామస్థులు తమతోపాటు ఒక వేట కుక్కను కూడా తెచ్చారు. అది కుందేలును తరుముకుంటూ పరిగెత్తింది.

''అవును! మొసలి చెప్పిందే నిజం! ఇదే లోకం తీరు!'' అనుకుంటూ కుర్రవాడు బాధగా ఇంటిదారి పట్టాడు. ★




# దేశభక్తి

రచన : జి. ఘణిశ్యామ్, ఆర్. పోలవరం, ఆం.ప్ర.

గంగులు పాండ్యదేశంలో పేరుమోసిన గజదొంగ. వాడి పేరు చెబితే చాలు, పిల్లలు కూడా జడుసుకుంటారు. ఎంత ప్రయత్నించినా రాజభటులు వాణ్ణి పట్టుకోలేకపోయారు.

వాడు ఒకనాడు అర్ధరాత్రి సమయంలో పట్టణంలోని ప్రధాన వర్తకుడి ఇంటబడి దోచుకుని, భటుల కంట బడడంతో గుర్రంపై ఎక్కి పారిపోయాడు. పొలిమేర వరకు వెళ్ళి గుర్రాన్ని చీకట్లో వదిలి, దాపులనున్న పాడు పడిన గుళ్ళోకి వెళ్ళి దాక్కున్నాడు. కొంతసేపటికి అక్కడికి పాండ్యదేశపు దళనాయకుడు, మరిద్దరు సైనికులతో వచ్చాడు. అంతకు ముందే ఇద్దరు కొంకణదేశపు గూఢచారులు అక్కడ వున్నారు. పాండ్య కొంకణ రాజ్యాల మధ్య తీరని పగ ఉన్నది.



పాండ్యరాజ్య దళనాయకుడు కొంకణ గూఢచారులకు, ఒక లేఖను అందించి, ''దీనిని మీ రాజుకు అందజేయండి. పాండ్య దేశపు రాజు సూర్యసేనుడి మరణానంతరం రాజ్యానికి వచ్చిన చంద్రసేనుడు యుద్ధంలో అనుభవం లేనివాడు. పాండ్య దేశపు సైనిక బలగాల వివరాలు నేనిచ్చిన లేఖలో ఉన్నాయి. ఇప్పుడు ముట్టడిస్తే పాండ్యదేశాన్ని పట్టుకోవడం సులభం,'' అన్నాడు.

ఆ మాటలు విని చీకట్లో దాక్కుని వున్న గంగులు ఉలిక్కిపడ్డాడు. ఒక్క గెంతున వెళ్ళి గూఢచారి చేతిలోని లేఖను లాక్కుని, గుర్రంపై రాజధానికేసి దూసుకుపోయాడు. వెనకనుంచి గూఢచారులూ, సైనికులూ



వాడిపై కత్తులు విసిరారు. వాటిలో ఒక కత్తి గంగులు కుడిభుజంలో దిగింది. గంగులు నెత్తురోడుతున్న గాయంతో రాజభవనంలో ప్రవేశించి, ఆ లేఖను అందించి దేవాలయంలో జరిగిన సంగతి చెప్పాడు.

రాజాజ్ఞ ప్రకారం సైనికులు వెళ్ళి కొంకణ దేశ గూఢచారులనూ, తమ దళ నాయకుణ్ణీ బంధించి తెచ్చి కారాగారంలో వుంచారు.

ప్రాణాలొడ్డి రాజ్యానికి రానున్న ఆపద నుంచి కాపాడినందుకు గజదొంగ గంగుల్ని సన్మానించాలా? లేక ఇన్నాళ్ళు దొంగతనాలు చేస్తూ, ప్రజలను భయభ్రాంతులను చేసినందుకు వాణ్ణి శిక్షించాలా? అన్న ధర్మ సంశయంలో రాజు చంద్రసేనుడు రాత్రంతా నిద్రపోలేకపోయాడు. తల్పానికి పక్కన వున్న దంతపు పేటికలో ఆయనకు ఒక తాళపత్ర గ్రంథం కనిపించింది.

అది తండ్రి చనిపోతూ తనకు ఇచ్చిన గ్రంథం. రాజు ఆ తాళపత్రగంథాన్ని అందుకుని చదవసాగాడు. అందులో మొదటి పత్రం మీదే, ''దేశభక్తికి మించిన గొప్ప గుణం లేదు!'' అన్న వాక్యం కంటబడింది.

రాజు ఒక నిర్ణయానికి వచ్చి ప్రశాంతంగా నిద్రపోయాడు.

మరునాడు రాజు సభ ఏర్పాటు చేసి బాధ్యతాయుతమైన పదవులలో వుండీ దేశద్రోహానికి పాల్పడిన దళనాయకుడికీ, అతడి అనుచరులకూ మరణశిక్ష విధించాడు. పరిస్థితుల కారణంగా దొంగగా మారినప్పటికీ, తగిన సమయంలో దేశానికి రానున్న ఆపదను తొలగించిన గంగులు పాత నేరాలను క్షమించి వాడికి రాజభవనంలో ఉద్యోగం ఇచ్చాడు. ★



V. Aadhavan, Tamilnadu

# రాజుగారి చేతిరుమాళ్ళు

రచన : శైలబాల మొహంతి, ఒరిస్సా

ఒకానొకప్పుడు ఒక రాజు ఉండేవాడు. ఆయనకు వేట అంటే ఎంతో ఇష్టం. అందులోనూ మారువేషం ధరించి వేటకు వెళ్ళడం అంటే మహాసరదా.

ఆయన ఒకనాడు ఎప్పటిలాగే మారువేషంలో అడవిలో చాలాసేపు వేటాడి దారితప్పి


Sarthak Sobhana Satpathy, Orissa

పొరుగుదేశపు సరిహద్దు ప్రాంతంలో అడుగు పెట్టాడు. ఆయనకు దాహం ఎక్కువ కావడంతో నీళ్ళకోసం వెతుక్కుంటూ ఒక సెలయేరును చేరాడు. దోసిలితో నీళ్ళు తాగబోతూండగా గలగలమని స్త్రీల నవ్వు వినిపించింది. ఆయన నవ్వు వినిపించిన దిక్కుకేసి చూశాడు. దాపులవున్న ఒక నదిలో కొందరు యువతులు స్నానం చేస్తూ కనిపించారు. వారిలో ఒక యువతి మరీ అందంగా కనిపించింది. ఆమె ఆ దేశపు యువరాణి అని తెలిసింది. అయినా రాజు తాను



ఎవరైనదీ చెప్పకుండా దాచాడు. యువతులు స్నానం ముగించి గట్టు చేరాక, రాజు ఆ యువరాణిని పెళ్ళాడాలనే తన కోరికను తెలియజేశాడు. యువరాణి సిగ్గుతో, ''నువ్వు మా తండ్రిగారితో మాట్లాడు. నా మంచి చెడ్డలు ఆయనే నిర్ణయిస్తాడు,'' అన్నది.

రాజు వారివెంట రాజధానికి వెళ్ళాడు. వృద్ధుడైన రాజుకు తన కోరికను తెలియజేశాడు. వృద్ధరాజు కొంతసేపు ఆలోచించి, ''నువ్వు జీవనోపాధికి ఏంచేస్తావు?'' అని అడిగాడు.

''బొమ్మలు గీస్తాను. అల్లికలు అల్లుతాను,'' అన్నాడు రాజు.

వృద్ధరాజు తృప్తి చెందాడు. యువరాణిని మారువేషంలో వున్న రాజుకిచ్చి పెళ్ళి చేసి, ఆయన వెంట సాగనంపాడు.

రాజు తన రాజధానికి చేరాడు. యువరాణి చాలా సంతోషించింది.

రాజు మళ్ళీ ఒకనాడు మారువేషం ధరించి, వేటకు వెళ్ళాడు. మార్గమధ్యంలో బందిపోటులు ఒక గ్రామాన్ని దోచుకోవడం చూసి అడ్డుకోబోయాడు. రాజు అని తెలియక దొంగలు కోపంతో ఆయన్ను పట్టుకుని తమ స్థావరమైన కొండమీద గుహకు పోయి అక్కడ వున్న చెట్టుకు బంధించారు. తన ఇంట ధనం ఎక్కడ వున్నదో చెబితే తప్ప వదిలిపెట్టమని బెదిరించారు. రాజు ఇంట ధనం లేదని ఎంత చెప్పినా దొంగలు వినిపించుకోలేదు. ఒకవారం గడిచింది. అఖరికి రాజు దొంగలకు ఒక సలహా ఇచ్చాడు. ''కొన్ని



చేతిరుమాళ్ళు తీసుకురండి. నేను వాటిపై అందమైన అల్లికలు అల్లుతాను. అలాంటి అల్లికలు గల రుమాళ్ళకు రాజభవనంలో మంచి గిరాకీ వుంటుంది. ముఖ్యంగా అవంటే రాణిగారికి చాలా ఇష్టం. మీరు అడిగిన ధరతో పాటు బహుమానం కూడా లభించవచ్చు,'' అన్నాడు రాజు.

దొంగలకు ఆ సలహా నచ్చింది. రాజ్యంలోని బట్టల కొట్లలోని చేతిరుమాళ్ళనన్నింటినీ తెచ్చి రాజు ముందు వుంచారు. రాజు శ్రద్ధగా వాటి మీద రంగురంగుల నూలు దారాలతో అందమైన పూలబొమ్మలు అల్లాడు. మధ్య మధ్య కొన్ని మాటలను కూడా ఇమిడ్చాడు. చదువురాని బందిపోట్లు అక్షరాలను కూడా ఏవో అల్లికలు అనుకున్నారు. వాళ్ళు వాటిని అమ్మడానికి మామూలు వేషాలతో రాజభవనానికి తీసుకువెళ్ళారు.

రాణిగారు వాటిని చూడగానే అవి తన భర్త అల్లిన అల్లికలని గ్రహించింది. వాటిద్వారా తన భర్త తనకేదో సందేశం పంపాడని కూడా ఊహించి, రాజుగారి చేతిరూమాళ్ళను ఒకదాని పక్కన ఒకటి వుంచి చూసింది. ఆయన పంపిన సమాచారం ఆమెకు అందింది. ఆయన ఇప్పుడు ఏ స్థితిలో ఎక్కడ ఉన్నదీ తెలిసిపోయింది. రాణి రుమాళ్ళను తెచ్చిన వారికి కొంత ధనమిచ్చి పంపేసింది. ఆ రాత్రికి రాత్రే తమ సైనికులను దొంగల స్థావరానికి పంపింది. సైనికులు బందిపోటు దొంగలను బంధించి, రాజుగారిని విడిపించి రాజధానికి తీసుకువచ్చారు. ★

# దీపావళి కథలు - విశేషాలు

మన పురాణాలలోని శ్రీకృష్ణుడు, రాముడు, లక్ష్మి, కాళి, మహాబలి, ఇంద్రుడు, యముడు మొదలైన దేవుళ్ళకూ, దేవతలకూ మనం యేటా జరుపుకునే దీపావళి పర్వదినానికీ ఏదో ఒక విధమైన సంబంధం ఉన్నది.

దీపావళిని దేశమంతటా వివిధ ప్రాంతాలలో విభిన్న పద్ధతులలో జరుపుకుంటారు. ఆయా ప్రాంతాల సంప్రదాయాలకు అనుగుణంగా దానికి సంబంధించిన కథలు కూడా చెప్పుకుంటారు. దీపావళి అంటే దీపాల వరుస అని అర్థం. దసరా తరవాత ఇరవైరోజులకు ఆశ్వయుజ (నవంబర్-డిసెంబర్) అమావాస్య రోజున దీపావళి జరుపుకుంటారు.



శ్రీరాముడు పధ్నాలుగేళ్ళ వనవాసం ముగించి, రావణ సంహారం చేసి సీతాలక్ష్మణ సమేతంగా అయోధ్యకు తిరిగివచ్చిన సందర్భంగా నగర ప్రజలు ఇంటింటా దీపాలు వెలిగించి శ్రీరాముడికి ఉత్సాహంగా స్వాగతం పలికారు. అదే దీపావళి అయిందని రామాయణం చెబుతుంది.



ఉత్తర భారతదేశంలో కొన్ని ప్రాంతాలలో దీపావళిని ఐదురోజులపాటు జరుపుకుంటారు. అమావాస్యకు రెండురోజుల ముందు దీపావళి ఆరంభమవుతుంది. 'ధన్ తెరాజ్' అనే మొదటి రోజు దేవతల వైద్యుడైన ధన్వంతరిని పూజిస్తారు. అమృతం కోసం దేవ దానవులు పాలసముద్రాన్ని మథించినప్పుడు అందులోనుంచి ధన్వంతరి ఆవిర్భవించాడని పురాణాలు చెబుతాయి. దీనిని 'ధన్ త్రయోదశి' అని కూడా అంటారు.

మరణభయం లేకుండా ఉండడం కోసం కొందరు ఇల్లంతా చిన్న చిన్న దీపాలు వెలిగిస్తారు. వీటిని యమదీపాలంటారు. ఒక యువరాజు పెళ్ళయిన నాలుగోరోజే పాముకాటుకు గురై మరణిస్తాడని జ్యోతిష్కులు చెప్పారు. అది తెలిసిన అతని భార్య విచారంతో భర్త గది నిండా చిన్నచిన్న దీపాలు వెలిగించి ఆ రాత్రంతా భక్తిగీతాలు పాడుతూ, దైవ సంబంధమైన కథలు



చెబుతూ గడిపింది. ఆమె భర్త ప్రాణాలు అపహరించడానికి పామురూపంలో వచ్చిన యముడు ఆమె పాటలు వింటూ, వచ్చినపని మరిచిపోయి ఆ రాత్రంతా అక్కడే ఉండి, తెల్లవారాక వెళ్ళిపోయాడట. మరణ ఘడియలు దాటిపోవడంతో యువరాజు బతికి పోయాడు. ఆ కారణంగానే ఇప్పటికీ యమదీపాలు వెలిగించే ఆచారం కొనసాగుతోంది!





రెండవ రోజు నరక చతుర్దశి. శ్రీకృష్ణుడు నరకాసురుణ్ణి వధించి ప్రజల కష్టాలు పోగొట్టిన రోజు. కొన్ని ప్రాంతాలలో దీనిని 'రూప్ చతుర్దశి' అని కూడా అంటారు. నీళ్ళలో మూలికలు వేసి తలస్నానం చేస్తారు.





దక్షిణ భారతదేశంలో ముఖ్యంగా తమిళనాడులో ఈరోజు సూర్యోదయానికి ముందే అభ్యంగనస్నానం చేయడం ఆచారంగా ఉంటోంది. ఈ పుణ్యఘడియల్లో స్నానం చేయడం గంగానదిలో స్నానం చేసినంత పుణ్యప్రదం గనక దీనిని 'గంగాస్నానం' అని అంటారు. స్నానం చేశాక కొత్త బట్టలు ధరించి, పిండివంటలు చేసుకుని ఇంటిల్లిపాదీ కూర్చుని హాయిగా తింటారు. ఆఖరున అజీర్తి రాకుండా ఉండడానికి సొంఠి, బెల్లం కలిపి చేసిన 'లేహ్యం' తింటారు.





మూడవరోజు అమావాస్య. ఉత్తర భారత దేశంలో దీనిని లక్ష్మీపూజగా లేదా 'చోపడాపూజ'గా జరుపుకుంటారు. వ్యాపారులు కొత్త లెక్కలు మొదలుపెడతారు. అందరూ కొత్తదుస్తులు ధరిస్తారు. కొత్త పాత్రలు కొనుక్కుంటారు. లక్ష్మీదేవికి స్వాగతం చెప్పడానికి ఇంటిని శుభ్రపరిచి అలంకరిస్తారు.





దీపావళికి సంబంధించిన మరొక పూజ 'గోవర్ధన పూజ'. యేటా వర్షాలు కురిసి పాడి పంటలు పుష్కలంగా ఉండాలని గోకులంలో యేటా ఇంద్రపూజ జరిపేవారు. ఇంద్ర పూజకన్నా గోవర్ధనగిరిని పూజించడం ఉత్తమమని బాలకృష్ణుడు తనవారికి సలహా ఇచ్చాడు. వాళ్ళు అలాగే చేశారు. అది తెలిసి ఆగ్రహం చెందిన ఇంద్రుడు వ్రేపల్లెను ముంచెత్తడానికి కొన్ని రోజులపాటు ఏకధాటిగా ఉరుములూ మెరుపులతో జడివాన కురిపించాడు. బాల కృష్ణుడు చిటికెనవేలితో గోవర్ధనగిరిని ఎత్తి, గొడుగులా పట్టి గోపాలకులను కాపాడాడు. అప్పటినుంచి గోవర్ధనగిరిని పూజించే ఆచారం ఏర్పడింది.



యమధర్మరాజు ఒకానొకప్పుడు తన సోదరి ఇంటికి వెళ్ళాడు. అన్నను చూడగానే అమితానందం చెందిన ఆమె అతని నుదుట తిలకం దిద్ది నమస్కరించింది. యముడు ఆమెకు అపూర్వమైన కానుకలు ఇచ్చాడు. అన్నాచెల్లెళ్ళ అనురాగం కలకాలం వర్ధిల్లింది. అందు వల్ల దీపావళిపండుగ ఐదవరోజు అన్నలూ, తమ్ముళ్ళూ, అక్కాచెల్లెళ్ళ ఇళ్ళకు వెళ్ళి కానుకలు ఇచ్చి పరస్పర ప్రేమానురాగాలను పంచుకునే సంప్రదాయం ఏర్ప డింది. ఉత్తర ప్రాంతంలో దీనిని 'భాయ్‌దూజ్' అంటారు.



# నరకాసుర వధ!



మన పండుగలలో దీపావళికి ప్రత్యేకమైన ప్రాముఖ్యత ఉన్నది. అలాగే దీపావళికి సంబంధించిన పురాణ కథలూ చాలా ఉన్నాయి. దీపావళినాడు దీపాలు వెలిగే ఇంట్లోకి లక్ష్మీదేవి ప్రవేశిస్తుందన్నది పలువురి విశ్వాసం. శ్రీకృష్ణుడు లోకకంటకుడైన నరకాసురుణ్ణి వధించి లోకకల్యాణం సమకూర్చడంవల్ల దీపావళికి ముందు రోజును నరకచతుర్దశిగా జరుపుకునే సంప్రదాయం ఏర్పడింది.

శ్రీ మహావిష్ణువు హిరణ్యాక్షుణ్ణి వధించడానికి వరాహావతారం ఎత్తాడు. వరాహమూర్తి ద్వారా భూదేవి నరకాసురుణ్ణి కన్నది. అతడు గొప్ప చక్రవర్తిగా గానీ, భయంకరుడైన రాక్షసుడుగాగానీ పరిణమించగలడని దైవజ్ఞులు చెప్పారు. తన బిడ్డ గొప్ప ధర్మప్రభువు కావాలని భూదేవి కాంక్షించింది. అతడిపై దుష్టప్రభావాల నీలినీడలు పడకుండా జాగ్రత్త పడింది. అయినా అసురగురువైన శుక్రాచార్యుడు నరకుడిదగ్గరికివచ్చి, "నువ్వు అసురకుల రక్షణకు జన్మించిన అపురూపవీరుడవు! నీ బాధ్యతలను గుర్తెరిగి నడుచుకో," అని బోధించాడు.



దాంతో నరకుడి జీవనమార్గం మలుపు తిరిగింది. కఠోర తపస్సు చేసి బ్రహ్మనుంచి అపూర్వవరాలు పొందాడు. భూదేవి ప్రార్థన మేరకు మహావిష్ణువు అతనికి నారాయణాస్త్రం ప్రసాదించాడు.

అపూర్వవరాలు సిద్ధించడంతో అతడిలో అహంకారం పెరిగింది. సజ్జనులనూ, సాధువులనూ, దేవతలనూ వేధించడం ఆరంభించాడు. మునులు చేసే యజ్ఞయాగాదులను ధ్వంసం చేశాడు.

ఆఖరికి ఇంద్రలోకంపై దండెత్తి, ఇంద్రుణ్ణి ఓడించాడు. అద్భుతవరుణచ్ఛత్రాన్ని చేజిక్కించుకున్నాడు. ఇంద్రసింహాసనాన్ని ఆక్రమించి, మునులనూ, దేవతలనూ తరుమగొట్టి వికటాట్టహాసం చేశాడు.

ఆ తరవాత భూలోకంలోని తన రాజధానీ నగరం ప్రాగ్జ్యో

తిషపురం చేరి దుష్ట రాక్షసపాలనను కొన సాగించాడు.

వేలాదిమంది స్త్రీలను చెరపట్టాడు.

మునులూ, దేవతలూ ద్వారకకు వెళ్ళి, శ్రీకృష్ణుణ్ణి దర్శించి, భయంకరుడైన నరకాసురుడి బాధల నుంచి తమను రక్షించమని మొరపెట్టుకున్నారు.

శ్రీకృష్ణుడు సత్యభామా సమేతంగా గరుడ వాహనారూఢుడై ప్రాగ్జ్యోతిషపురం చేరాడు. భీకరాకారులైన కాపలా భటులను వధించి, దుర్భేద్యమైన నరకుడి కోటను ఛేదించుకుని, లోపలికి ప్రవేశించాడు. నరకుడు కృష్ణుడితో భీకరంగా పోరాడాడు. నరకుడు విసిరిన ఆయుధం తలకు తగలడంతో కృష్ణుడు మూర్ఛపోయాడు.



ఆ క్షణమే సత్యభామ విల్లందుకుని నరకుడిపై బాణవర్షం కురిపించింది. ఆపదలో భర్తకు బాసటగా నిలిచి అర్ధాంగి అన్న పేరును సార్థకం చేసుకున్నది. భూదేవి అంశ కలిగిన సత్యభామ వదిలిన బాణాలు తగలగానే నరకుడు బలహీనుడయ్యాడు. అంతలో మూర్ఛ నుంచి తేరుకున్న కృష్ణుడు నరకుడితో యుద్ధానికి దిగాడు. ఆఖరికి సుదర్శన చక్రాన్ని ప్రయోగించి నరకాసురుణ్ణి వధించాడు.

నరకుడు చెరపట్టిన స్త్రీలను విడిపించాడు. అతడు ఇంద్రలోకం నుంచి అపహరించిన అదితి కర్ణకుండలాలనూ, వరుణ ఛత్రాన్నీ కృష్ణుడు మళ్ళీ వాళ్ళకు అప్పగించాడు.

లోకకంటకుడైన నరకుడు మరణించడంతో ప్రజలందరూ ఆనందంతో పండుగ చేసుకున్నారు.

ఆ రోజు ఆశ్వయుజ బహుళ చతుర్దశి కావడం వల్ల యేటా ఆ రోజును నరక చతుర్దశిగా పండుగ జరుపుకునే సంప్రదాయం ఏర్పడింది.

మనిషి అంటే ఎదుటివారికి మంచి చేసేవాడు. పరులకు హాని చేసి పీడించేవాడు రాక్షసుడు. అలాంటివాణ్ణి శిక్షించి ప్రజలను కాపాడేవాడు దేవుడు. ఈ నిజాన్ని అందరూ గ్రహించి మంచి మార్గంలో పయనిస్తే ప్రతి రోజూ దీపావళే! నరక చతుర్దశి మనకు అందించే ఉదాత్తసత్యం ఇదే!



# మరపురాని దీపావళి

ఆహా! మనం ఆ శుభసమయానికి చేరువవుతున్నాం. దీపాల పండుగ దీపావళి వచ్చేస్తోంది! సంవత్సరం పొడవునా ఇనుపపెట్టెలో పడివున్న నన్ను వెలుపలికి తీసే సమయం ఇదే. నన్ను బాగా తోమి తళతళ లాడేలా చేస్తారు. నాలో నూనె నింపి, వత్తి వేస్తారు. అంతే! అందంగా, నయనానందకరంగా వెలిగే రోజు వచ్చేసిందన్నమాట!

నేనెవరయిందీ, ఇప్పుడు మీరు గ్రహించేశారుగా! అవును, ఇత్తడి దీపాన్ని. ఉత్తరప్రదేశ్‌లోని వారణాసి నగరం అందమైన ఇత్తడి వస్తువులకు ప్రసిద్ధి గాంచింది కదా! నన్ను కూడా అక్కడే తయారు చేశాడొక హస్తకళాకారుడు. అదెప్పుడో తెలుసా? పదేళ్ళనాడు.

నా ఆకారం చిన్నదే. మామూలు దీపాన్నే. కానీ వెలిగేప్పుడు నా అందాన్ని మీరు చూసి తీరవలసిందే!

నన్ను తయారుచేసి తీసుకెళ్ళి అంగట్లో పెట్టారు. చూసీచూడగానే శకుంతలమ్మత్తయ్య నన్ను కొనేశారు. నన్ను మరికొన్ని రకరకాల చిన్నా పెద్ద దీపాలతో కలిపి, పక్కింటి ఊర్మిళకు పెళ్ళికానుకగా ఇచ్చేశారు.

పదేళ్ళక్రితం నేను ఊర్మిళతోపాటు ఆమె మెట్టినిల్లయిన శర్మగృహం చేరుకున్నాను. అప్పటినుంచి వాళ్ళతోనే ఉంటున్నాను. ఈ కుటుంబంతో కలిసి గడిపిన తొలి దీపావళి నాకింకా తొలివెలుగులా గుర్తుంది. పట్టుచీర కట్టుకుని కొత్త పెళ్ళికూతురుగా అత్తవారింట అడుగుపెట్టిన ఊర్మిళ రూపం నా మనసులో ఇంకా అలాగే ఉంది. మేలిముసుగులో చంద్రబింబంలాంటి ఆమె ముఖం నా వెలుగు పడగానే వింతకాంతితో వెలిగిపోయింది. నన్ను వాకిట ముందు ఉంచారు. అక్కడ ఉంచిన ఇత్తడి దీపం నేను ఒక్కటే. నా చుట్టూ మట్టి ప్రమిదలే. దేవుడి గదిలో పెద్దపెద్ద వెండిదీపాలు వెలిగించారు.

శర్మ వాళ్ళది బాగా ఉన్న కుటుంబం. వాళ్ళకు దీపాలంటే ఇష్టం. సెలవులు వస్తే చాలు. విలాస యాత్రలకనీ, తీర్థయాత్రలకనీ, దేశంలోని వివిధ ప్రాంతాలకు వెళుతుంటారు. ఆయా ప్రాంతాలకు ప్రత్యేకమైన దీపాలు కనిపిస్తే తప్పకుండా కొనితెస్తూ ఉంటారు.

అందువల్ల ఈ ఇంట్లో ఉన్న దీపాలు ఎన్ని అని అడిగితే చెప్పలేను. బెంగాల్‌నుంచి తెచ్చిన టెర్రకోట దీపాలు; దక్షిణాదిలో ముఖ్యంగా తమిళనాట ప్రసిద్ధమైన పెద్దపెద్ద కుత్తువిళక్కులు అంటే పంచముఖజ్యోతులు ; కామాక్షి దీపాలు ; కర్నాటకకు చెందిన నల్లమట్టి దీపాలు ; కేరళప్రాంతానికి చెందిన బరువైన ఇత్తడి గురువాయూర్ దీపాలు ; మహారాష్ట్రకు చెందిన చిన్నచిన్న దీపాలు ; హారతి, అర్చన దీపాలు. ఇలా ఎన్నని చెప్పను? కోకొల్లలు!

పూజాసమయంలో దీపాల ప్రాముఖ్యతను



గురించి నేను కొత్తగా చెప్పవలసింది లేదు. ప్రాచీన కాలంలో వీరులను యుద్ధరంగానికి పంపేప్పుడూ, వీరులు విజయంతో తిరిగివచ్చినప్పుడు స్వాగతం చెప్పడానికీ దీపాలు వెలిగించేవారు.

అవునూ, మీకు దీపనృత్యం గురించి తెలుసా? పంజాబులో పెళ్ళి సమయంలో చేసే 'జోగో' ; గుజరాత్‌లో చేసే మనోహరమైన 'గొర్బా' దీప నృత్యాలే!

నన్ను ఊర్మిళకు కానుకగా ఇచ్చిన శకుంతల మ్మత్తను గురించి చెప్పానుకదా? ఆమె బియ్యప్పిండీ, బెల్లమూ కలిపి రెండు ప్రమిదలు చేసి, వాటిని నెయ్యితో నింపి ఆషాఢమాసం ఐదు శుక్రవారాలూ నట్టింట వెలిగించేది. ఇది ఈ ప్రాంతం ముత్తయిదువలు ఆచరించే ప్రధానమైన ఆచారంగా ఉంటోంది!



ఇకనేనున్న ఇంట్లో దీపాలంటే అందరికీ ఇష్టమే. ఒక్క జిమ్మీకి తప్ప. అదే ఈ ఇంట్లో తిరిగే అల్సేషియన్ కుక్క. వరసగా వెలుగుతూన్న దీపాలను చూస్తే చాలు అది గుర్రుమంటూ తిరిగేది. అది కనిపిస్తే చాలు మాకు ఒళ్ళంతా దడపుట్టేది. అది ఎన్నో మట్టి ప్రమిదలను పడదోసి పగులగొట్టేది కూడా.

ఈ రోజు దీపావళి కదా! ఊర్మిళ కూతుళ్ళు నీల, నిర్మలలకు చెప్పలేనంత ఆనందం. జిమ్మీకి ఉత్సాహంగానే ఉంది. నిండు ముత్తయిదువుగా ఊర్మిళ ఇల్లంతా దీపాలు వెలిగిస్తూ వుంటే జిమ్మీ అటూ ఇటూ పచార్లు చేస్తోంది. వత్తిని వెలిగించగానే నాలో పాత ఉత్సాహం నూతన వేగంతో ప్రసరిస్తోంది!

మిలమిలా మెరుస్తూన్న పెద్ద పళ్ళెంలో, చిన్న చిన్న దీపాల మధ్య నన్ను వుంచి ఊర్మిళ తీసుకు వెళుతోంది. జిమ్మీ ఆమె మోచేతుల మీదికి ఎగురుతోంది. అది నాకు భయం పుట్టిస్తోంది. ప్రహరీగోడ మీదా, డాబా పిట్టగోడ మీదా వరసగా ప్రమిదలు అందంగా వెలుగుతున్నాయి. వాకిట్లో వేసిన పెద్ద ముగ్గుమీద పళ్ళెంలో నాతోపాటు వున్న దీపాలన్నిటినీ తీసి అలంకరించింది.

ఇప్పుడు పళ్ళెంలో నేనొక్కత్తెనే మిగిలాను. పళ్ళెంలో నుంచి, ఊర్మిళ నన్ను జాగ్రత్తగా పైకెత్తేప్పుడు, జిమ్మీ ఆమె చేతికి అడ్డు తగిలింది. అంతే నేను కిందపడిపోయాను. వెలుగుతూన్న వత్తి నానుంచి దూరంగా ఎగిరి ఊర్మిళ పాదం దగ్గిర పడింది. నాకు ప్రాణం పోయినంత పనయింది. నేను హడలిపోయాను. ఒక అగ్నిప్రమాదానికి నేను కారణం కాకూడదు కదా! నేను నేలపై పడిపోయాను. నూనె మొత్తం ఒలికిపోయింది. అయినా నా గుండె దడ ఆగలేదు. దేవుడా! ఊర్మిళకు ఏమీ కాకూడదు!

అదృష్టవశాత్తు జిమ్మీ మళ్ళీ ఒక్క గెంతున వచ్చి వత్తిని పక్కకు తోసింది. అది దాని కాలికి తగలడంతో బాధతో కుయ్ కుయ్ మంటూ అరవ సాగింది. ఆసరికి ఊర్మిళకు జరుగుతున్నదేమిటో తెలిసి మండుతూన్న వత్తిని ఆర్పేసింది. అమ్మయ్య... బతికిపోయాను. జిమ్మీ కూడా కొద్ది గాయాలతో బయటపడింది. ఈ దీపావళి రోజున జిమ్మీకి నా మనసులో చెరిగిపోని స్థానం ఏర్పడింది. అది కాస్త అల్లరిప్రాణే! అయినా నేను అనుకున్నట్టు, పాపం చెడ్డది మాత్రం కాదు.

ఇప్పుడు నిజంగా మాది ఒక పెద్ద కుటుంబం. ఆనందనిలయం. ఇది నాకొక మరచిపోలేని దీపావళి!



# దీపలక్ష్మి

సుసంపన్నమైన చంద్రగిరి రాజ్యానికి రాజు సురేంద్రవర్మ. ఆయన భార్య రత్నప్రభాదేవి అద్భుత సౌందర్యరాశి. ఆమె అంటే రాజుకు అమితమైన అభిమానం.

ఒకనాడు విదేశీవర్తకులు కొందరు రాజదర్శనానికి వచ్చి, ఆయనకు కొన్ని అపూర్వ వజ్రాలను బహూకరించారు. ఆ వజ్రాలను హారంలో పొదిగి రాణి గారికి పుట్టినరోజు కానుకగా ఇవ్వాలని రాజుకు కోరిక కలిగింది.

రాజ్యంలో పేరుమోసిన స్వర్ణకారులను పిలిపించాడు. హారాల నమూనాలు చూపమన్నాడు. వాళ్ళు చూపిన నమూనాలను పరిశీలించి, వాటిలో ఉత్తమంగా ఉన్న దానిని ఎంపికచేసి, వజ్రాలహారం తయారు చేయమన్నాడు. స్వర్ణకారులు అదేపనిగా పూనుకుని వారంలోగా వజ్రాలు పొదిగిన ఒక చక్కని హారం తయారు చేశారు. దానిని చూసి రాజూ, రాణీ పరమానందం చెందారు.

రాణిగారి ఆనందానికయితే హద్దులు లేకుండా పోయింది. జన్మదిన వేడుకలలో తొలిసారిగా హారాన్ని ధరించిన ఆమె, ఆ తరవాత దానిని తీసి పక్కన పెట్టడానికి కూడా ఇష్టపడేది కాదు!

రాజభవనాన్ని అనుకుని చిన్న నది ప్రవహిస్తూండేది. రాణి రోజూ పరిచారికలతో వెళ్ళి నదిలో స్నానం చేసేది. ఒకనాడు ఆమె ఎప్పటిలాగానే నదీస్నానానికి వెళ్ళి, వజ్రాల కంఠహారాన్ని తీసి దుస్తులతోపాటు గట్టున వుంచి స్నానఘట్టంలోకి దిగింది.

తళతళా మెరుస్తూన్న వజ్రాలహారం ఆకాశంలో ఎగురుతూన్న ఒక గద్ద దృష్టిలో పడింది. అదేదో ఆహారం అని భ్రమపడి గద్ద కిందికి వాలి క్షణంలో వజ్రాలహారాన్ని తన్నుకు పోయింది.

స్నానం చేస్తున్న రాణి దానినిచూసి దిగ్భ్రాంతి చెందింది. పరిచారికలు ఒక్కుమ్మడిగా గోల పెట్టారు. క్షణాలలో రాజుగారికి వార్త అందింది. ఆయన రాణిగారి విషాదవదనాన్ని చూడ లేకపోయాడు. ఆ హారాన్ని తెచ్చి ఇచ్చిన వారికి కోరిన బహుమతి ఇస్తానని చాటింపు వేయించాడు.

రాజభవనానికి దూరంగా, నదీతీరంలో వున్న పూరిగుడిసెలో నిరు పేదరాలైన బట్టలుతికే ముసలిది నివసిస్తూండేది. ఆమెకు తినడానికి తిండీ లేదు; ముసలితనం కార ణంగా ఇల్లూ, వాకిలీ శుభ్రంగా ఉంచుకునే ఓపికా లేదు. ఆమె పడు కున్న మంచం మీదికి ఒక తొండ దూకింది. దానిని తరమడానికి చేతిలోని కర్రను దాని మీదికి విసి రింది. ఆ దెబ్బకే తొండ చచ్చి ఊరుకుంది. ముస లిది ఆ తొండను తీసి గుడిసె మీదికి విసిరింది. సరిగ్గా ఆ సమయానికి రాణిగారి కంఠ హారాన్ని ఎత్తుకుపోతూన్న గద్ద, అటుకేసి ఎగురుతూ వచ్చి, చచ్చి పడివున్న తొండను చూసింది. మరుక్షణమే పట్టుకున్న హారాన్ని వదిలేసి, తొండను ఎత్తుకు పోయింది. దభీమని పడ్డ శబ్దం వినిపించడంతో వెలుపలికి వచ్చిన ముసలిది, కప్పుమీద ఏదో మెరుస్తూ కనిపించడంతో మెల్లగా కప్పుపైకి ఎక్కి చూసింది. తళతళా మెరుస్తూ వజ్రాల హారం! దానిని జాగ్రత్తగా కిందికి తెచ్చిన ముస లిది, అది రాజభవనానికి చెందిన ఆభరణమే అయివుంటుందని ఊహించింది. దానిని ఇంట్లో భద్రంగా దాచి, ఆ రోజు ఉతికిన బట్టలు ఇవ్వ డానికి నగరంలోకి వెళ్ళింది. అప్పుడామెకు రాణి గారి వజ్రాలహారాన్ని గద్దతన్నుకుపోవడం; దానిని కనిపెట్టి తెచ్చి ఇచ్చిన వారికి కోరిన బహుమతి ఇస్తానని రాజు ప్రకటించడం తెలియవచ్చింది.



ఇంటికి వచ్చిన ముసలిది ఆ హారాన్ని ఒక గుడ్డలో మడిచి, దుస్తుల్లో భద్రంగా దాచుకుని రాజ భవనం దగ్గరికివెళ్ళి రాజును చూడాలన్నది. తన దర్శ నానికి ఎవరు వచ్చినా అను మతించమని రాజు ఆజ్ఞా పించి ఉండడంతో, రాజ భటులు ఆమెను లోపలికి వెళ్ళనిచ్చారు.

ముసలిది రాజుకు నమ స్కరించి, ''మహారాజా! రాణి గారి విలువైన వజ్రాలహారం పోయినట్టు విన్నాను,'' అన్నది. అవును అన్నట్టు రాజు తల ఊపాడు.

''దానిని తెచ్చి ఇచ్చిన వారికి కోరినది ఇస్తానని తమరు ప్రకటించారు కదా? ఆ మాటమీదే నిలుస్తారా?'' అని అడిగింది ముసలిది.

''తప్పకుండా!'' అన్నాడు రాజు, ఈ ముస లిది ఏమి అడుగుతుందో అని ఆలోచిస్తూ.

''ఇదిగో మీ హారం!'' అంటూ ముసలిది దుస్తుల్లో దాచిన హారాన్ని తీసి రాజు ముందు వుంచి, అది తనకు ఎలా లభించిందో వివ రించి, ''ఇప్పుడు నేను అడిగినది మీరు ఇవ్వ గలరా?'' అని అడిగింది.

రాజు వెంటనే సమాధానం చెప్పకుండా కొంతసేపు మౌనం వహించాడు. ముసలిదాని కోరిక ఏమై వుంటుందా అని సభలోని వారందరూ నిశ్శబ్దంగా ఎదురుచూడసాగారు.

రాజు ఆమెకేసి చూస్తూ అడుగు అన్నట్టు తల పంకించాడు.

''మహారాజా! మరో ఐదురోజులలో దీపావళి రానున్నది. దీపావళినాటి రాత్రి నేను తప్ప రాజ్యంలో మరెవ్వరూ దీపాలు వెలిగించరాదని ఆజ్ఞాపించు. రాజ భవనంలో సైతం ఒక్కదీపం కూడా వెలగకూడదు. అదే నా కోరిక!'' అన్నది ముసలిది దృఢమైన కంఠస్వరంతో.



విపరీతమైన ఆ కోరిక విని రాజు ఒక్క క్షణం నిశ్చేష్టుడయ్యాడు. ఆ తరవాత ముసలిది మరేదో కోరుకోలేదుకదా అని నిట్టూర్చాడు. ఆడినమాట తప్పడం భావ్యం కాదు గనక, ఆమె కోరిన విధంగానే రాజ్యంలో చాటింపు వేయించాడు.

ఆ దీపావళి నాటి రాత్రి రాజ్యమంతా అంధకారం అలుముకున్నది. ఒకే ఒక చోట మాత్రం దీపం వెలుగు మిణుకు మిణుకు మంటూ కనిపించింది. అదే నదీతరంలోని ఆ ముసలిదాని పూరిగుడిసె!

అర్ధరాత్రి సమయంలో లక్ష్మీదేవి దివి నుంచి భువికి దిగివచ్చి, ఆ రాజ్యంలో అడుగుపెట్టింది. ఎటు చూసినా కారు చీకటి! ఆమె కలత చెందింది. దీపం వెలుగు వస్తూన్న గుడిసె తలుపు తట్టింది. పూజలో నిమగ్నమైవున్న ముసలిది చిరాకుగా 'ఎవరక్కడ' అని అడిగింది.

'మొదట నన్ను లోపలికి రానివ్వు. చుట్టూ అంధకారం. భయంగా ఉన్నది!'' అన్నది శుభ్రమైన ప్రదేశాలకే అలవాటుపడిన లక్ష్మీదేవి.

''నువ్వెవరో చెప్పనేలేదే!'' అని అడిగింది ముసలిది.

'నేను లక్ష్మీదేవిని. దీపావళి శోభను తిలకించడానికి దివినుంచి వచ్చాను. ఇక్కడేమో ఒకటే చీకటి! చీకటి!'' అన్నది లక్ష్మీదేవి విసుగ్గా.

''ఇన్ని సంవత్సరాలు పూజిస్తున్నా, నా గుడిసెకేసి రాని నిన్ను ఇప్పుడు నేనెందుకు లోపలికి అనుమతించాలి?'' అన్నది ముసలిది కోపంగా.

అయితే, లక్ష్మీదేవి వదిలిపెట్టలేదు. తలుపు తీయమని ప్రాథేయపడింది. ఆఖరికి ముసలిది కాస్త మెత్తబడి, ''ఇప్పుడు లోపలికి అడుగుపెట్టావంటే, ఆ తరవాత మరెప్పుడూ నా ఇల్లు వదిలిపోనని మాట ఇస్తేనే నిన్ను లోపలికి అనుమతిస్తాను,'' అన్నది.

అలాగే అంటూ లక్ష్మీదేవి గుడిసెలో అడుగు పెట్టింది. ఇల్లంతా వింతవెలుగుతో నిండిపోయింది.

శాశ్వతమైన లక్ష్మీకటాక్షం కారణంగా ముసలిది మరెప్పుడూ దారిద్ర్యబాధలకు లోనుకాలేదు!



# నిజమైన (దీపావళి) కల!



అప్పుడప్పుడే తెల్లవారుతోంది. ఉదయభానుడి లేత కిరణాలు ఆకాశాన్ని బంగారు రేఖలతో అలంకరిస్తున్నాయి. అంబాపురం బాలబాలికలు అప్పటికే రాజంపేటకేసి నడిచి వెళుతున్నారు.

రాజంపేటలో రాజశేఖరంగారి బాణాసంచా తయారుచేసే ఫ్యాక్టరీ ఉంది. అయితే, రాజశేఖరం మాత్రం లండన్‌లో ఉంటూ మరికొన్ని వ్యాపారాలు చూసుకుంటున్నాడు. రాజంపేటలోని ఫ్యాక్టరీ నిర్వహణా బాధ్యతలు చంద్రమోహన్ అనే మేనేజర్ చూసుకుంటున్నాడు. పెద్దలకయితే ఎక్కువ కూలీ ఇవ్వాలి కాబట్టి, ఫ్యాక్టరీలో పిల్లలకే ఎక్కువ ఉద్యోగాలు. మేనేజర్ ఎప్పుడూ పిల్లల జీతం ఎంత తగ్గించవచ్చు ; ఎంత తాను వెనకేసుకోవచ్చు అన్న విషయమే ఆలోచిస్తూ ఉంటాడు. భయంకరుడైన ఆ మేనేజర్ అంటే అందరికీ భయమే!

ఆ ఫ్యాక్టరీలోనే అంబాపురానికి చెందిన — మోహన్, కృష్ణ, సీత, జాన్సన్, అఫ్సర్ అనే ఐదుగురు పిల్లలు ఉదయం నుంచి, సాయంకాలం వరకు పని చేస్తారు. వాళ్ళందరూ ఏడేళ్ళనుంచి పదకొండేళ్ళ లోపు వాళ్ళు. రెక్కల కష్టం మీదే ఆధార పడ్డ ఆ పిల్లల తల్లిదండ్రులకు — తమ పిల్లల్ని కూడా పనులకు పంపితే తప్ప రెండు పూటలా గంజి కూడా దొరకని దుస్థితి. రాజంపేట అంబాపురానికి దూరంలో ఉండడం వల్ల, పిల్లలు సూర్యోదయానికి ముందే బయలుదేరారు.

ఆ పిల్లల్లో అఫ్సర్ ఎప్పటిలాగే ఏదో ఆలోచిస్తూ నడుస్తున్నాడు. అనారోగ్యంతో బాధపడుతూన్న తన తల్లికీ, నాలుగేళ్ళ తమ్ముడికీ ఏదైనా దీపావళి కానుక ఇవ్వాలి. యేడాది క్రితం రోడ్డు ప్రమాదంలో తన తండ్రి మరణించినప్పటినుంచి తాము అనుభవిస్తూన్న కష్టాలు అన్నీఇన్నీ కావు. చేతుల్లో పైసలు లేనందువల్ల ఈద్ పండుగకూడా భారంగా, విషాదంగానే గడిచిపోయింది.

మోహన్, కృష్ణ ఏదో పాట పోటీపడి బిగ్గరగా పాడుకుంటూ నడుస్తున్నారు. సీత దారిలో దొరికిన జామకాయలు తింటూ నడుస్తోంది. జాన్సన్ రకరకాల పక్షుల కూతలను అనుకరించడానికి ప్రయత్నిస్తూ నడుస్తున్నాడు.



మొత్తంమీద సమయానికి వాళ్ళు ఫ్యాక్టరీని చేరుకున్నారు. వాళ్ళలాగే చుట్టుపక్కల గ్రామాల నుంచి యాభై, అరవైమంది పిల్లలు ఆ ఫ్యాక్టరీలో పనిచేస్తున్నారు. పిల్లల్ని మోసం చేయడం సులభం గనక, పెద్దల కన్నా పిల్లలకే ఫ్యాక్టరీలో పనిచేయడానికి అవకాశం ఇస్తాడు మేనేజర్.

రసాయనిక పదార్థాలు కలిపేటప్పుడు అవి చేతికి తగలడం వల్ల, అఫ్సర్ చేతివేళ్ళ చర్మం ఊడిపోయి కాలిపోయినట్టు కనిపిస్తున్నది. సంవత్సరారంభంలో చేతులకు తొడుక్కోవడానికి, రబ్బరు తొడుగులు ఇచ్చారు. కాని అవి కొన్నాళ్ళకు అరిగిపోయి, చిరిగిపోయాయి. మేనేజర్ ఆ తరవాత కొత్తవి కొనిపెట్ట లేదు. చేతులు మంటలు పుడుతున్నాయి. ఆ బాధను భరించలేక, అఫ్సర్ కలపడం ఆపి పక్కకు వెళ్ళాడు. అప్పుడే తలుపుకు అవతల వున్న టెలిఫోన్‌గంట మోగింది. చంద్రమోహన్ ఫోన్‌ను అందుకుని, "ఎవరూ?" అన్నాడు అదిలిస్తున్నట్టు. అయితే మరుక్షణమే నవ్వుతూ, అతి వినయంగా, "నమస్కారం! నమస్కారం! అవును.



బాబూ! ఇక్కడ అన్నీ సక్రమంగా నడుస్తున్నాయి. అవునవును. అలాగే... ఈ మధ్యే జీతాలు పెంచాను. కార్మికులందరూ చాలా సంతోషంగా ఉన్నారు. రేపే మీకు అక్కౌంట్ బుక్స్ పంపుతాను. తమరు ఇంత దూరం వచ్చి తమ సమయాన్ని వృథా చేసుకోనవసరం లేదు. అలాగే... అలాగే... ఏవైనా సమస్యలుంటే నేనే మీకు తెలియజేస్తాను. నమస్కారం!" అన్నాడు.

అఫ్సర్ ఇంకా తలుపు దగ్గరే నిలబడి ఉన్నాడు. మేనేజర్ ఫోన్ సంభాషణ ద్వారా జరుగుతున్నదేమిటో వాడికి చూచాయగా అర్థమయింది. వెంటనే వాడు మేనేజర్ కంటబడకుండా పక్కకు తప్పుకున్నాడు.

సాయంకాలం దారిపొడుగునా అఫ్సర్‌కు పొద్దున విన్న మాటలే గుర్తుకువస్తున్నాయి. తీవ్రంగా ఆలోచించసాగాడు. తమ యజమాని మంచివాడనీ, ఫ్యాక్టరీలో జరుగుతూన్న అన్యాయాలు ఆయనకు తెలియవనీ వాడు గ్రహించాడు. ఇక్కడ జరుగుతూన్న అన్యాయాలను యజమానికి ఎలాగైనా తెలియజేయాలి.

ఆ విషయం సీతకు చెప్పాడు. ఆ అమ్మాయికి పదకొండేళ్ళు. తనకన్నా ఒక సంవత్సరం పెద్దది. రెండేళ్ళు బడికి కూడా వెళ్ళింది. ఆ తరవాత పేదరికం కారణంగా అందరిలాగే పనికిరావడం మొదలు పెట్టింది.

సీత అఫ్సర్ సలహా ప్రకారం – యజమానికి ఒకసారి ఫ్యాక్టరీకి వచ్చి పరిస్థితులను ప్రత్యక్షంగా పరిశీలించి, సరిదిద్దమని ప్రార్థిస్తూ ఉత్తరం రాసింది. అఫ్సర్ అందులో సంతకం చేశాడు.

మ ం ర ం నా డ ం ఉదయం సీత ఫ్యాక్టరీకి కాస్త ఆల స్యంగా రావాలనీ, మేనేజర్ వెళ్ళి ఆమెను మందలిస్తున్న సమయంలో అఫ్సర్ ఆయన గదిలోకి వెళ్ళి, అతడు యజమానికి పంపే అక్కౌంటు బుక్‌లో ఉత్తరం పెట్టాలనీ పథకం వేసుకున్నారు.

మరునాడు ఉదయం అందరితో పాటు వచ్చిన సీత కొంచెందూరంలోనే ఆగిపోయింది. మిగిలిన పిల్లలు వేగంగా ఫ్యాక్టరీని చేరు కున్నారు. వాళ్ళను చూడగానే మేనేజర్, "ఇంకో పిల్ల ఎక్కడ?" అని అడిగాడు.

కృష్ణ ఏదో చెప్పబోయాడుగాని నోటి నుంచి మాట పెగల్లేదు. అఫ్సర్ దూరంనుంచి, "మేము బయలుదేరేంత వరకూ సీత నిద్ర లేవలేదు బాబూ," అన్నాడు గట్టిగా.

"వచ్చిన వాళ్ళు శిలల్లా అలాగే నిలబడి పోయారేంటి? పనిలోకి దిగండి," అని గద్దిస్తూ మేనేజర్ అక్కడే నిలబడ్డాడు.

ఇదే సమయం అనుకుని అఫ్సర్ వెనక వైపు నుంచి మేనేజర్ గదిలోకి వెళ్ళాడు. టేబుల్ మీద అందమైన పెద్ద పుస్తకం కనిపించింది. అదే అక్కౌంటు

బుక్కయి వుంటుందని భావించి అఫ్సర్ జేబులోని ఉత్తరాన్ని అందులో పెట్టి గుట్టుచప్పుడు కాకుండా వచ్చేశాడు.

అయితే, ఆ రోజంతా తాను ఉత్తరం పెట్టింది సరైన పుస్తకంలోనేనా అనే అనుమానంతో అఫ్సర్ పనిచేయ సాగాడు. వాడు ఇంటికి వెళ్ళే ముందు మేనేజర్ గదిలోకి తొంగిచూశాడు. టేబుల్ మీద పొద్దున తాను చూసిన పుస్తకాల్లాగే చాలా పుస్తకాలు ఒకదానిమీద ఒకటి పేర్చబడి వుండడం చూసి అదిరిపడ్డాడు. ''పొర బాటు చేశానా? ఉత్తరం గనక మేనేజర్ కంట్లోపడిందా ఉన్న పని కాస్త ఊడిపోతుంది. ఆ తరవాత తల్లినీ, తమ్ముణ్ణీ కాపాడ్డం ఎలా?'' మొదలైన ఆలోచనలతో గుండె బరువెక్కడంతో మాటామంతీ లేకుండా మౌనంగా ఇంటికేసి నడిచాడు.

ఆ తరవాత నెలరోజులు గడిచిపోయాయి. అయితే అఫ్సర్‌కు మాత్రం ఒక్కొక్కరోజు ఒక్కొక్క గండంగా తోచింది. ఆ ఉత్తరం యజమానికి అందిందా? లేదా? అన్న అనుమానంతో సతమతం కాసాగాడు.

ఒకనాడు ఉదయం ఫ్యాక్టరీ ఆవరణలో అందమైన కారు ఒకటి ఉండడం చూసి పిల్లలు ఆశ్చర్య పోయారు. హడావుడిగా అక్కడికి వచ్చిన మేనేజర్ అందరినీ ఫ్యాక్టరీ వెనక్కుతీసుకువెళ్ళి, ''ఈ రోజు మీరందరూ ఇళ్ళకు వెళ్ళండి. మన యజమాని శేఖరం బాబు వచ్చారు. మీ పనితీరు చూసి మండిపడ్డారు. మీ ఏడుపుకొట్టు మొహాలు చూస్తూంటే నాకే సయించడం లేదు. పొద్దుటే మీ పాడు మొహాలు చూడడానికి బాబుగారు ఇష్టపడరు. పనుల్నుంచి ఇప్పుడే తొలగించేస్తారు. మరో ముఖ్యవిషయం. మీకీ ఉద్యోగాలు దక్కాలంటే – మేనేజర్ మమ్మల్ని బాగా చూసుకుంటున్నారు. మాకే కొరతా లేదు అని మీరంతా యజమానిగారితో చెప్పాలి. అర్థమయిందా?'' అన్నాడు.

హఠాత్తుగా రాజశేఖరం లోపలికి వచ్చి, ''ఇక్కడ ఏం జరుగుతున్నది. అయినా పిల్లలకు ఇక్కడేం పని? బడికి వెళ్ళలేదా? అవునూ, ఇక్కడ అఫ్సర్ ఎవరు? నేను అతనితో మాట్లాడాలి,'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

పిల్లలు అఫ్సర్‌ను చూపారు.

''రాబాబూ, ఇలారా! నిన్నేం చేయను,'' అంటూ వాడి చేతులకేసి చూసి, ''అదేంటి వేళ్ళలా కాలి పోయి ఉన్నాయి? ఎందుకలా అయింది?'' అని అడిగాడు.

మిగతా పిల్లలందరూ తమ చేతులను కూడా చూపి సంగతి వివరించారు.

రాజశేఖరం మేనేజర్‌కేసి కోపంగా చూస్తూ, ''మా పూర్వీకుల స్వస్థలంలో నేను ఏర్పాటు చేసిన ఫ్యాక్టరీని నువ్వు నడిపే లక్షణం ఇదన్నమాట!'' అన్నాడు.

మేనేజర్ అవమానంతో, భయంతో తల వంచుకున్నాడు.

రాజశేఖరం పిల్లలకేసి తిరిగి, ''మీ సంక్షేమం పట్ల నేను చూపిన నిర్లక్ష్యానికి క్షమాపణలు చెప్పుకుంటున్నాను. జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు ఇక్కడ పనిచేస్తూన్న బాలబాలికలందర్నీ బడులలో చేర్పిస్తాను. ఫీజులతో సహా మీ ఆలనా పాలనా చూసుకునే బాధ్యత నాది!'' అంటూ పిల్లలకు స్వీటుప్యాకెట్లూ, టపాకాయల ప్యాకెట్లూ పంచాడు.

ఆ రోజు వరకు తమ ఇళ్ళనుంచి సూర్యోదయాన్ని చూడలేకపోయిన ఆ పిల్లల మనసులలో నూతన విశ్వాసం ఉదయించింది.

అఫ్సర్ మనసులోనే అల్లాకు కృతజతలు చెప్పుకున్నాడు. తన తల్లీ, తమ్ముడితో కలిసి జరుపుకోనున్న ఆనందదీపావళిని తలుచుకుంటూ ఉత్సాహంగా ఇంటికేసి నడిచాడు.

కె.సి. నిత్య



# యువాన్‌షియావో ఇల్లు చేరిన కథ




చాలా సంవత్సరాలకు పూర్వం వూడీ అనే చక్రవర్తి చైనాదేశాన్ని పాలించేవాడు. ఆయన రాజ భవనంలో యువాన్ షియావో అనే పరిచారిక ఉండేది. సంవత్సరం పొడవునా ఒక్క రోజు కూడా విశ్రాంతి లేకుండా ఆమె పనిచేస్తూ ఉండేది. ఆమెకు తన కుటుంబం వారిని చూసి రావాలనే కోరిక కలిగింది. అయినా ఎవరూ ఆమెను పట్టించుకోలేదు. ఆ కాలంలో సేవకులు ఎవరూ రాజ భవనం వదిలి వెళ్ళకూడదనే నియమం ఉండేది. ఆ నిబంధనను తప్పకుండా అమలు పరిచేవారు.

యువాన్‌షియావోకు రాజభవనంలో డాంగ్ ఫ్యాంగ్ అనే స్నేహితుడుఉండేవాడు. ఆయన ఒక మంత్రి. ఆమె ఆయనకు చందు రొట్టెలు, చేసి ఇచ్చేది. ఆ రొట్టెలంటే ఆయనకు ఎంతో ఇష్టం.



ఒకనాడు యువాన్‌షియావో, కుటుంబాన్ని చూసి రావాలన్న తన కోరికను డాంగ్ ఫ్యాంగ్‌కు తెలియజేసింది. ఆయన ఆమెకు ఎలాగైనా సాయపడాలని నిర్ణయించుకున్నాడు. ఆయన చాలా తెలివైనవాడు కాబట్టి, మంచి ఉపాయాన్ని ఆలోచించాడు.

మంత్రి కావడంవల్ల, చక్రవర్తి ఆయన మాట వింటాడు. ఆయన చక్రవర్తిని కలుసుకుని, ''కొత్తసంవత్సరం వేడుకల చివరి రోజు, అంటే చాంద్రమానం మొదటి నెల పదిహేనవ తేదీ — మన నగరాన్ని నాశనం చేయమని స్వర్గాధిపతి, అగ్నిదేవుణ్ణి ఆజ్ఞాపించాడట!'' అన్నాడు.

చక్రవర్తి తరుణోపాయం ఏమిటి అని అడిగాడు.

''అగ్నిదేవుడి ఆగ్రహం నుంచి నగరాన్ని కాపాడుకోవడానికి మనం ప్రజలందరి సాయం

పొందాలి. ప్రతిఒక్కరూ వాళ్ళ వాళ్ళ కుటుంబాలను కలుసుకోవాలి. ఆ రాత్రి ప్రతి ఇంటి ముందూ ఎర్రలాంతరు వెలిగించాలి. ఆ రాత్రంతా వాళ్ళ వాళ్ళ శక్త్యానుసారం బాణాసంచా పేల్చాలి. ఇవన్నీ అగ్ని దేవుణ్ణి ఆనందపరుస్తాయి గనక, ఆయన మనకు హాని చేయడు,'' అన్నాడు మంత్రి.

''అలాగా!'' అన్నాడు చక్రవర్తి.

''అవును ప్రభూ! అగ్నిదేవుడికి ఇష్టమైన చందురొట్టెలు కూడా పెట్టాలి,'' అన్నాడు మంత్రి వినయంగా.

యువాన్‌షియావో తయారుచేసే చందురొట్టెలు అప్పటికే ప్రసిద్ధం గనక, ఆమెను చాలా రొట్టెలు తయారుచేయమని చెప్పారు.

మంత్రి చెప్పినట్టే ప్రజలందరూ నడుచుకోవాలని చక్రవర్తి ప్రకటించాడు.

ఆనాటి రాత్రి ఎర్రలాంతర్ల వెలుగులతో, బాణాసంచా పేలుళ్ళతో, ప్రజలందరూ కుటుంబాలతో కలిసి చందురొట్టెలు తినడంతో నగరం ఆనంద మయం అయింది. ఆ విధంగా యువాన్ షియావో తన కుటుంబాన్ని కలుసుకోవాలనే కోరిక తీరింది!

నగరానికి ఎటువంటి ఆపదా కలగలేదు. పైగా ఆనాటి వేడుకలు చక్రవర్తికి ఎంతో ఆనందం కలిగించాయి. కాబట్టి యేటా ఇదేవిధంగా పండుగ జరుపుకోవాలని రాజు ప్రకటించాడు. ఆ కారణంగా యేడాదికో సారి బాణాసంచా వేడుకలు జరుపుకోవడం అలవాటయింది. నూతన సంవత్సర వేడుకల చివరి రోజున లాంతరు ఉత్సవం జరుపుకోవడం ఆచారమయింది!

చాంద్రమాన నూతనసంవత్సరాన్ని చైనాలో వసంతోత్సవంగానూ కొన్ని రోజులపాటు జరుపుకుంటారు. కొత్త సంవత్సరం ఆరంభం కావడానికి ఇరవై రోజులు ముందునుంచే చెత్తా చెదారాన్ని శుభ్రం చేసి ఇల్లూ వాకిలీ అలంకరిస్తారు. ఇంటిల్లిపాదికీ కొత్త బట్టలు కొంటారు.



రేపు కొత్త సంవత్సరం అంటే ఈరోజే గృహిణులు ఇళ్ళను శుభ్రం చేసేస్తారు. సంవత్సరాది రోజున శుభ్రం చేస్తే అశుభం అనీ, తాము ఊడ్చే చెత్తతో పాటు తమ అదృష్టం

కూడా వెళ్ళిపోతుందనీ కొందరు భావిస్తారు.



ఆరోజు అందరూ పిండివంటలు చేసుకుని తింటారు. ముఖ్యంగా ఎనిమిది రకాల కూరలతో 'అష్టనిధి భోజనం' చేస్తారు. పిల్లలు పెద్దల నుంచి డబ్బున్న ఎర్రటి కవర్లు పుచ్చుకుంటారు.

సాయంకాలం అందమైన లాంతర్లు వెలిగించి దుష్టశక్తులను భయపెట్టి, నూతన సంవత్సరాన్ని ఆహ్వానించడానికి బాణాసంచా పేలుస్తారు. మనదేశంలో కొన్ని ప్రాంతాలలో దీపావళి రోజున చేసే విధంగా కొందరు వ్యాపారులు కొత్త లెక్కలు కూడా ప్రారంభిస్తారు.

కొత్తసంవత్సరం పదిహేనవ రోజు లాంతరు ఉత్సవం జరుపుకుంటారు. కొత్త సంవత్సరంలో వచ్చే తొలి పౌర్ణమి అయిన ఆనాటి రాత్రి ఆకాశంలో ఎగిరే దేవతలు కనిపిస్తారని కొందరి విశ్వాసం. అందుకోసం వారిని లాంతర్లతో వెతుకుతారట! ఆ రాత్రి బియ్యంతో తయారుచేసే యువాన్‌షియావో (పౌర్ణమిని గుర్తు చేసే) చందురొట్టెలు చేసి తింటారు.

ఈ సందర్భంగా కొన్ని దేవాలయాలలో 'డ్రాగన్ నృత్యం' కూడా ఏర్పాటు చేస్తారు. మెరిసే కళ్ళతో, రంగురంగుల అలంకారాలతో, వింతవింత వాద్యాల ఘోషతో వంద అడుగుల పొడవు డ్రాగన్‌ను వీధులగుండా నాట్యం చేయిస్తూ ఊరేగింపుగా తీసుకువెళతారు. దీంతో నూతన సంవత్సర వేడుకలు సమాప్తమవుతాయి!

## దారి చూపగలరా?

ఆవలి మూలనున్న టపాకాయలను అందుకోడానికి ఈ గడుసరి కుర్రాడు బయలుదేరాడు. మరి వాడికి దారిచూపగలరేమో చూడండి. అయినా ఈ చిక్కు దారి మధ్యలో వున్న ప్రేలుడు పదార్థాన్ని తప్పించుకుని వాడు ముందుకు వెళ్ళాలన్న విషయం గుర్తుంచుకోండి!



## మీకు తెలుసా?

- విక్రమశక పంచాంగం దీపావళి రోజున ఆరంభమవుతుంది. ఈ పంచాంగం క్రీ.పూ. 58 లో ఆరంభమయింది. ఉత్తర-మధ్య భారతదేశాన్ని పరిపాలించిన విక్రమాదిత్యుడి పట్టాభిషేకోత్సవానికి గుర్తుగా ఇది ఆరంభమయిందని కొందరు చరిత్రకారులు చెబుతారు. అందుకే ఉత్తర భారతదేశంలో విక్రమశకాన్ని అనుసరించేవాళ్ళు దీపావళిని నూతన సంవత్సరాదిగా జరుపుకుంటారు.
- జైనమత సంస్థాపకుడు వర్ధమాన మహావీరుడు దీపావళి రోజున నిర్వాణం పొందాడని జైనుల విశ్వాసం. అందుకే జైనులు దీనిని 'దేవ్ దీవాళి' అని అంటారు. ఆ రోజు వాళ్ళు అందరికీ తీపి తినుబండారాలు పంచుతారు. ఇళ్ళను దీపాలతో అలంకరిస్తారు. మత గ్రంథాలను పఠిస్తారు. అర్ధరాత్రి సమయంలో ఆరంభించి తెల్లవారేవరకు మహావీరుణ్ణి పూజిస్తారు.
- పశ్చిమ బెంగాల్‌లో దుర్గామాతను భయంకరరూపంలో పూజించే కాళీ (శ్యామ) పూజ కూడా దీపావళితో కలిసివస్తుంది.

## దీపావళి మిరమిట్లు

ఇద్దరూ అంతకన్నా ఎక్కువమంది ఆడే ఆట ఇది. ఆటను ఆరంభించాలంటే పాచికలో మీకు 'ఆరు' పడాలి. ఇచ్చిన సూచనలను అనుసరిస్తూ మీ కాయలను కదిలించండి మరి!



# రంగుల తమాషా!

పసివాడైన నచికేతుడు సరాసరి యమలోకానికి వెళ్ళి జననమరణాల రహస్యం గురించి సాక్షాత్తు యమధర్మరాజుతోనే చర్చకు దిగాడట. వాళ్ళిద్దరి మధ్య ఆ సంభాషణ దీపావళి సమయంలోనే జరిగిందని చెబుతారు. ఇప్పుడు మీరూ ఆ ఇద్దరి బొమ్మలకు రంగులు వేసి ఆ ఘట్టాన్ని మరింత రసవత్తరంగా మార్చగలరేమో చూడండి!



58. ఘటోత్కచ భగదత్తుల పోరాటం

# మహాభారతం

యుద్ధం చాలా తీవ్రంగా ఉన్నది. తన కొడుకైన ఇరావంతుడు చనిపోయినట్టు అర్జునుడికి ఇంకా తెలియదు. అతను కౌరవ పక్ష వీరులను చంపటంలో నిమగ్నుడై ఉన్నాడు. రెండో వైపు నుంచి భీష్ముడు పాండవ సేనలను హడలగొట్టేస్తున్నాడు. భీముడూ, ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ తమ పరాక్రమాన్ని ప్రదర్శిస్తున్నారు. ఈ అందరినీ మించి ద్రోణుడు దారుణంగా యుద్ధం చేస్తున్నాడు.

ఇరావంతుడు చావటం చూసి, భీముడి కొడుకైన ఘటోత్కచుడు భయంకరమైన పెడబొబ్బ పెట్టి, భయంకరాకారంతో, చేతిలో ఒక మెరిసే శూలాన్ని పట్టుకొని, రాక్షస గణాలను వెంటబెట్టుకుని బయలుదేరాడు. అతన్ని చూసి, కౌరవసేనలు దడుచుకున్నాయి. అది చూసి దుర్యోధనుడు యుద్ధసన్నద్ధుడై, ఘటోత్కచుడికి ఎదురువచ్చి, సింహనాదం చేశాడు. దుర్యోధనుడి వెనకగా వంగదేశపు రాజు పదివేల ఏనుగులతో వచ్చాడు. ఆ ఏనుగుల సేనను చూసేసరికి ఘటోత్కచుడికి మండిపోయింది.

అతని రాక్షసులు ఏనుగులసేన మీద పడి ధ్వంసం చెయ్యసాగారు. గజయోధులు చుస్తూ ఉండటం చూసి దుర్యోధనుడు బాణాలతో ఆ రాక్షసులను చంపనారంభించాడు.





అప్పుడు ఘటోత్కచుడు దుర్యోధనుణ్ణి తానే ఎదుర్కొన్నాడు.

ఆ యుద్ధంలో బాగా గాయపడి రక్తం ఓడుతున్న ఘటోత్కచుడు దుర్యోధనుణ్ణి చంపటానికి ఒక గొప్ప శక్తిని చేతబట్టాడు. ఆ సమయంలో వంగదేశపు రాజు తాను ఎక్కిన గొప్ప ఏనుగును దుర్యోధనుడి రథానికి అడ్డంగా తోలాడు. ఘటోత్కచుడు విసిరిన శక్తి తగిలి ఆ ఏనుగు కూలిపోయింది. వంగరాజు దాని మీదనుంచి దూకి, ఎటో పారిపోయాడు. తరవాత ఘటోత్కచుడు విజృంభించి భయంకరంగా అరుస్తూ దుర్యోధనుణ్ణి పీడించసాగాడు.

ఘటోత్కచుడి పెడబొబ్బలు విని భీష్ముడు ద్రోణుడితో, ''దుర్యోధనుణ్ణి ఘటోత్కచుడు పీడిస్తున్నట్టున్నాడు. వాణ్ణి చంపటం ఎవరికీ సాధ్యం కాదు. మీరంతా వెళ్ళి దుర్యోధనుణ్ణి రక్షించండి,'' అన్నాడు.

ఆ మాట వింటూనే, ద్రోణుడూ, సోమదత్తుడూ, బాహ్లికుడూ, సైంధవుడూ, కృపుడూ, భూరిశ్రవుడూ, శల్యుడూ, బృహద్బలుడూ, అశ్వత్థామా, వికర్ణుడూ, చిత్రసేనుడూ, వివింశతీ మొదలైన మహాయోధులు అనేక రథాలను వెంటబెట్టుకుని వెళ్ళేసరికి, ఘటోత్కచుడిచే తరమబడుతున్న దుర్యోధనుడు కనిపించాడు. వాళ్ళు ఘటోత్కచుడికి అడ్డుపడి యుద్ధం సాగించారు. ఘటోత్కచుడు తన వారితో ఆ యోధులందరినీ ఎదుర్కొని పోరాడాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో మహావీరులందరూ దెబ్బతిన్నారు. కొందరు గాయపడ్డారు. కొందరి సారథులు చచ్చారు. మొత్తం మీద అందరూ యుద్ధవిముఖులయ్యారు.

వెంటనే ఘటోత్కచుడు మళ్ళీ దుర్యోధనుడి పైకి వెళ్ళాడు. అప్పుడు మరికొందరు కౌరవపక్షవీరులు ఘటోత్కచుడిపైన తలపడ్డారు. అతను వారితో యుద్ధం సాగించాడు.

ధర్మరాజు భీముడితో, ''నీ కొడుకు ఘటోత్కచుడు తనకు మించిన యుద్ధం చేస్తున్నాడు. పాంచాలులను నిర్మూలించే ప్రయత్నంలో ఉన్న భీష్మణ్ణి అర్జునుడు ఎదిరించి పోరాడుతున్నాడు,'' అన్నాడు. అర్జునుడికి సహాయంగా వెళ్ళటంకన్నా ఘటోత్కచుడికి సహాయం చెయ్యటం ఎక్కువ అవసరమని గ్రహించి భీముడు అతివేగంగా ఘటోత్కచుడి వద్దకు బయలుదేరాడు. అతని వెంట అభిమన్యుడూ, ఉపపాండవులూ, నీలుడూ, సత్యధృతీ, సౌచిత్తీ, శ్రేణిమంతుడూ, వసుతాసుడూ మొదలైన

వారు వెళ్ళారు. ఉభయపక్ష వీరులకూ తీవ్రమైన యుద్ధం జరిగింది. యుద్ధంలో పాండవ పక్షానిదే పైచెయ్యి అయింది.

అది చూసి దుర్యోధనుడు భీముణ్ణి ఎదుర్కొన్నాడు. యుద్ధంలో భీముడు దెబ్బ తిని, రథంలో కూలబడ్డాడు. అంతలో ఘటోత్కచుడూ, అభిమన్యుడూ మొదలైన పాండవ వీరులు దుర్యోధనుణ్ణి చుట్టుముట్టారు. దుర్యోధనుడు ప్రమాదంలో ఉండటం తెలిసి ద్రోణుడు అతనికి సహాయంగా కొందరు కౌరవవీరులను వెంటబెట్టుకుని వచ్చాడు. మళ్ళీ సాగిన యుద్ధంలో ఘటోత్కచుడు రాక్షస మాయలు ప్రయోగించి, శత్రువులకు దిగ్భ్రమ కలిగించాడు. ఘటోత్కచుడి దెబ్బకు తట్టుకోలేక కౌరవసైన్యాలు చెల్లాచెదరై, శిబిరాలకేసి పరిగెత్తసాగాయి.

అప్పుడు దుర్యోధనుడు భీష్ముడి వద్దకు వచ్చి, "తాతా, పాండవులు కృష్ణుణ్ణి నమ్ముకున్నట్టే, మేము నిన్ను నమ్ముకుని యుద్ధం ప్రారంభించాం. ఘటోత్కచుడూ, భీముడూ చేరి నాకు గొప్ప అపజయం కలిగించారు. ఈ అవమానం నన్ను నిలువునా దహిస్తున్నది. ఎలాగైనా ఈ రాక్షసాధముడు చావాలి. ఈ ఉపకారం చేసిపెట్టు," అన్నాడు.

అప్పుడు భీష్ముడు దుర్యోధనుడితో, "నాయనా, నువ్వు ధర్మరాజుతోగాని, భీముడితోగాని, అర్జునుడితోగాని, నకుల సహదేవులతోగాని యుద్ధం చెయ్యి. రాజు రాజుతో పోరాడటం రాజధర్మం. రాక్షసుడైన ఘటోత్కచుడితో పోరాడాలంటే మేమంతా ఉన్నాం. వాడితో యుద్ధం చెయ్యటానికి భగదత్తుణ్ణి పంపు. అతను ఇంద్రుడంతటి వాడు,"



అని భగదత్తుడితో, "నువ్వు అనేకమంది రాక్షసులతో పోరాడినవాడివి. ఘటోత్కచుణ్ణి ప్రతిఘటించటానికి నువ్వే సరిఅయినవాడివి. నువ్వు ఇప్పుడే వెళ్ళి మేమంతా చూస్తూండగా వాణ్ణి చంపెయ్యి," అన్నాడు.

భీష్ముడు ఈ మాట అనేసరికి భగదత్తుడు సుప్రతీకమనే తన గొప్ప ఏనుగు నెక్కి, పాండవయోధుల మీద యుద్ధానికివెళ్ళాడు. గొప్ప యుద్ధం జరిగింది. భగదత్తుడు భీముడితో తలపడ్డాడు. సుప్రతీకం అతివేగంగా భీముడి రథం మీదికి రావటం చూసి, కేకయులూ, ఉపపాండవులూ, అభిమన్యుడూ, దశార్ణరాజైన క్షత్రదేవుడూ, చేదిరాజైన చిత్రకేతుడూ ఆ ఏనుగుపై బాణాలవర్షం కురిపించారు. కాని సుప్రతీకం పాండవ సైన్యాన్ని ధ్వంసం చేయసాగింది. అది చూసి ఘటో



త్కచుడు భగదత్తుడి మీదికి వచ్చాడు. భగదత్తుడు అందరినీ వరసగా చితకగొట్టేశాడు. భీముడి సారథి రథంలోనే మూర్ఛపోయాడు.

ఇంతలో అర్జునుడు భీమ ఘటోత్కచులున్న చోటికి వచ్చి యుద్ధం చేశాడు. భగదత్తుడు తన ఏనుగు చేత పాండవ సైన్యాన్ని తొక్కిస్తూ వెళ్ళి, ధర్మరాజుతో యుద్ధం ప్రారంభించాడు.

ఆ సమయంలో, ఇరావంతుడు చనిపోయిన సంగతి భీముడికీ, అర్జునుడికీ తెలిసింది. అర్జునుడు చాలా బాధపడి, కృష్ణుడితో తన రథాన్ని కౌరవసేన మీదికి నడుపమన్నాడు. మళ్ళీ ఉభయపక్షాల వీరుల మధ్య యుద్ధం ప్రజ్వలించింది. ఈ యుద్ధంలో భీముడు వ్యూఢోంస్కుణ్ణీ, కుండలి అనే వాణ్ణీ, అనాధృష్టీ, కుండభేదీ, వైరాటుడూ, దీర్ఘనేత్రుడూ, దీర్ఘబాహువూ, సుబాహువూ, కనకధ్వజుడూ అనే వాళ్ళను, ధృతరాష్ట్రుడి కొడుకులను వరసగా చంపాడు. అతను అలా వారిని చంపేటప్పుడు ద్రోణుడు అతని పైన శరపరంపరలు ప్రయోగించి కూడా అతన్ని ఆపలేకపోయాడు. చీకట్లు పడుతూండగా, అలసిపోయిన ఉభయపక్షాల వారూ యుద్ధం చాలించి, శిబిరాలకు వెళ్ళిపోయారు.

అనంతరం దుర్యోధన, శకుని, దుశ్శాసనులు కర్ణుడితో కలిసి మంత్రాలోచన చేశారు. అప్పుడు దుర్యోధనుడు కర్ణుడితో, ''భీష్ముడూ, ద్రోణుడూ, శల్యుడూ ఎందు చేతనో పాండవులను బాధించలేకపోతున్నారు. పాండవులు అపజయమన్నది లేక మన సైన్యాన్ని నాశనం చేస్తున్నారు. రోజు రోజుకూ నా సేన తరిగిపోతున్నది. దేవుడూ, పాండవులూ కూడా నాకు పరాభవం కలిగిస్తున్నారు. నేను పాండవులను ఎలా జయిస్తానో తెలియకుండా ఉన్నది,'' అన్నాడు.

దానికి కర్ణుడు, ''మహారాజా, భీష్ముడు యుద్ధం విరమించనీ, నేను వచ్చి పాండవులను సోమకులతో సహా చంపేస్తాను. నా పరాక్రమం ఎలాటిదో భీష్ముడికి చూపుతాను. భీష్ముడికి పాండవుల మీద ప్రేమ. చూస్తూ చూస్తూ వారిని చంపడు, చంపలేడు కూడా. అందు చేత నువ్వు వెంటనే భీష్ముడి శిబిరానికి వెళ్ళి ఆయనను అస్త్రసన్యాసం చెయ్యమని చెప్పు. ఆయన ఆ పని చేసిన మరుక్షణం పాండవులు చచ్చారే అనుకో!'' అన్నాడు.

దుర్యోధనుడు తన తమ్ములనూ, ఇతరులనూ వెంటబెట్టుకుని భీష్ముడి వద్దకు వెళ్ళి, ''తాతా, నీకు నా మీద కోపమో, లేక

నా దురదృష్టమోగాని, నువ్వు పాండవులను రక్షిస్తున్నావు. నీ ఉద్దేశం వారిని రక్షించటమే అయితే యుద్ధం విరమించి, యుద్ధభారం కర్ణుడి మీద ఉంచు. అతనూ, అతని బంధువులూ పాండవులను జయిస్తారు,'' అన్నాడు.

ఈ మాటలు భీష్ముడికి ములుకుల లాగా తగిలాయి. ఆయన కళ్ళు ఎర్రబడ్డాయి. ఆయన మూడు లోకాలనూ దహించే వాడిలాగా అయిపోయి, ''దుర్యోధనా, ఇలాంటి మాటలు ఎందుకు అంటున్నావు? నా ప్రయత్నంలో లోపం ఏమిటి? శత్రువులను అపారంగా నాశనం చేస్తున్నాను. అర్జునుడు మహావీరుడని నీకు తెలియదా? నిన్ను గంధర్వులు పట్టుకుపోయినప్పుడు కర్ణుడు ఏం చేశాడు? ఉత్తర గోగ్రహణమప్పుడు అర్జునుడు మననందరినీ ఒంటిగా జయించలేదా? అతను ఇంద్రుడికి లొంగని నివాత కవచులను జయించాడే! ఈ యుద్ధం నువ్వు కోరి తెచ్చుకున్నది. నీ శత్రువును నువ్వే చంపు, మేం చూసి ఆనందిస్తాం. నా మాటకు వస్తే, నేను శిఖండిని తప్ప మిగిలిన సోమకులనూ, పాంచాలులనూ అందరినీ చంపుతాను, లేదా చచ్చిపోతాను. ఇంతకన్న నేను చెప్పేదేమీ లేదు. రేపు మహాయుద్ధం చెయ్యబోతున్నాను. ఇక నువ్వు వెళ్ళి పడుకో,'' అన్నాడు.

దుర్యోధనుడు ఈ మాటతో తృప్తిపడి, మర్నాడు నిద్రలేస్తూనే తన పక్షాన పోరాడే రాజులతో, ''ఇవాళ భీష్ముడు గొప్ప యుద్ధం చెయ్యబోతున్నాడు,'' అని చెప్పి, దుశ్శాసనుడితో, ''ఇవాళ మనకు విజయం కలగబోతున్నది. భీష్ముణ్ణిమనం రక్షించుకోవాలి. అందుకు



శకునీ, శల్యుడూ, కృపుడూ, ద్రోణుడూ, వివింశతీ సహాయపడాలి,'' అన్నాడు.

తొమ్మిదోరోజు యుద్ధం ఆరంభమయింది. భీష్ముడు సర్వతోభద్రమనే వ్యూహంలో కౌరవ సేనలను నిలిపాడు. పాండవులు దానికి ప్రతి వ్యూహం పన్నారు. యుద్ధం ఆరంభమవుతూనే అభిమన్యుడు రెచ్చిపోయి, రెండో అర్జునుడి లాగా కౌరవసేనలనూ, సైంధవుడూ, కృపుడూ, ద్రోణుడూ, అశ్వత్థామా లాటి మహావీరులను చెదరగొట్టేశాడు. అప్పుడు దుర్యోధనుడు రాక్షసుడైన అలంబుసుణ్ణి అభిమన్యుడి మీదికి పురికొల్పాడు.

అభిమన్యుడికీ, అలంబుసుడికీ యుద్ధం జరిగింది. అలంబుసుడు గొప్ప యుద్ధమే చేశాడుగాని, అతను అభిమన్యుడి ధాటికి తట్టుకోలేక మాయాయుద్ధానికి దిగి అందులోనూ

నెగ్గలేక, ఓడి పారిపోయాడు. తరువాత అభిమన్యుడు కౌరవసేనను ధ్వంసం చేస్తూపోయాడు.

ఆ సమయంలో భీష్ముడు అభిమన్యుణ్ణి ఎదిరించాడు. అదే సమయంలో అర్జునుడు కూడా అభిమన్యుడి వద్దకు వచ్చాడు. భీష్ముడి వెంట ఇంకా అనేక మంది మహావీరులున్నారు. అలాగే అర్జునుడి వెంట కూడా ఉన్నారు. ఉభయపక్షాలకూ గొప్ప యుద్ధం జరిగింది.

మరొక పక్క భీముడి పైకి భగదత్తుడూ, శ్రుతాయువూ ఏనుగుల సేనలతో వచ్చారు. భీముడు రథం నుంచి దిగి, తన చుట్టూ మూగిన ఏనుగులనూ, వాటి మీద ఉన్న యోధులనూ తన గదతో చావబాదసాగాడు.

ఆ రోజు భీష్ముడు మహాదారుణమైన యుద్ధం చేశాడు. పాండవసైన్యం విపరీతంగా నాశనమయింది. పాండవసైనికులు అస్త్రాలు కూడా వదిలేసి పారిపోయారు. సూర్యాస్తమయం అయి యుద్ధం నిలిచిపోయింది.

భీష్ముడు విజృంభిస్తే ఎలా యుద్ధం చేయగలడో చూసిన పాండవులకు గుండెల్లో రాయి పడినట్టయింది. ధర్మరాజుకు యుద్ధం మీద విరక్తి కూడా కలిగింది. ఆయన కృష్ణుణ్ణి, ఏం చేయాలని అడిగాడు. కృష్ణుడు ధర్మరాజును ఓదార్చుతూ, ''నువ్వు దిగులుపడకు. భీష్ముణ్ణి అర్జునుడు చంపకపోతే, నేను చంపుతాను. భీష్ముడు చచ్చిపోతే నువ్వు గెలవటానికి అడ్డు ఏదీ ఉండదు. తలుచుకుంటే అర్జునుడు భీష్ముణ్ణి తప్పక చంపగలడు. అది అతని కర్తవ్యం కూడా,'' అన్నాడు.

ఈ మాట విని ధర్మరాజు, కృష్ణుడితో, ''భీష్ముడు మా క్షేమం కోరినవాడు, మనం గెలవాలన్న కాంక్ష కలవాడు; మన పక్షాన యుద్ధం చెయ్యకపోయినా మనకు హితం చెబుతానన్నాడు. మనం ఆయన దగ్గరికి పోయి, ఆయన ఎలా చస్తాడో అడుగుదాం. అటువంటి మహాపురుషుణ్ణి చంపుదామనుకుంటున్నాం గదా, క్షత్రియ ధర్మం ఎంత పాపిష్ఠిది!'' అన్నాడు.

కృష్ణుడు ఈ మాటకు సంతోషించి, ''భీష్ముడి వంటి మహావీరుడు ఎలా చస్తాడో ఆయనే చెప్పాలి. మనం ఆయన వద్దకు పోదాం,'' అన్నాడు.





# చందమామ

## భారత దర్శనం పాఠకులకు క్విజ్

ఈ సంచికలోని ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో ప్రచురిస్తాం. ఈలోగా వాటి సమాధానాలు తెలుసుకోగలరేమో ప్రయత్నించి చూడండి.

నవంబర్ 14వ తేదీ బాలలదినం కదా! అందువల్ల ఈ నెల ప్రశ్నలు బాలపాత్రలకే పరిమితం చేయబడింది.

1



1) ఎ) సాందీపముని గురుకులంలో బాలకృష్ణుడితో కలిసి చదువుకుని, ఆ తరవాత చాలా సంవత్సరాలకు శ్రీకృష్ణుణ్ణి చూడడానికి ద్వారకకు వచ్చినవారెవరు?

బి) తండ్రి కోరికకు విరుద్ధంగా గొప్ప విష్ణు భక్తుడుగా మారిన రాక్షసరాజ కుమారుడు ఎవరు?

సి) తండ్రి తొడమీద కూర్చోవడానికి వెళ్ళి, సవతి తల్లిచేత అవమానించబడి, అడవికి వెళ్ళి కఠోరతపస్సుతో విష్ణువును మెప్పించి, ఆయన అనుగ్రహానికి పాత్రుడైన రాజకుమారుడు ఎవరు?

డి) పాముకాటుకు గురై ప్రాణాలు కోల్పోయిన తన కుమారుణ్ణి తీసుకుని దహనం చేయడానికి శ్మశానానికి తీసుకువెళ్ళిన తల్లి, అక్కడ తన భర్తను చూసింది. మరణించిన రాకుమారుడు ఎవరు?

ఇ) మహాభారతయుద్ధంలో కౌరవుల పద్మవ్యూహంలో చిక్కుకుని వీరోచితంగా పోరాడి వీరమరణం పొందిన పిన్నవయస్కుడైన పాండవవీరుడు ఎవరు?

2

2) అప్పటికే సాధువు అని పేరుతెచ్చుకున్న ఒక బాలుడు భక్తులకు ఆధ్యాత్మిక విషయాలను గురించి విశదీకరిస్తున్నాడు. ఆ బాలసాధువు 'ఆణవాణ్ణి' (తమిళంలో అహంకారాన్ని) జయిస్తే తప్ప మనిషి ముక్తిని సాధించలేడు అని చెబుతున్నప్పుడు ఒక మధ్యవయస్కుడు అక్కడికి వచ్చి, ''అహంకారం (ఆణవం) అంటే ఏమిటో నిర్వచించగలవా?'' అని నిలదీశాడు కోపంగా.

ఆయన గొప్ప పండితుడుగా, సాధువుగా పేరు ప్రఖ్యాతులున్నవాడు. తనంతటి గొప్పవాడు ఇక్కడ ఉన్నప్పుడు ఇంతమంది భక్తులు పసివాడి చుట్టూ చేరడం ఆయన సహించలేకపోయాడు.

బాలసాధువు ఏమీ మాట్లాడలేదు. అయితే పండితుడు అదే ప్రశ్నను మళ్ళీ మళ్ళీ మరింత గర్వంతో అడిగాడు. బాలసాధువు ఏమీ మాట్లాడకుండా తన దృష్టిని పండితుడి మీద నిలిపి చూపుడు వేలితో ఆయన్ను చూపాడు.

ఆ పండితుడి మోము వెలవెలబోయింది.

తానే మూర్తీభవించిన అహంకారం అని ఆయన గ్రహించాడు. ఆయన గజగజ వణుకుతూ, బాలసాధువు పాదాలపైబడి క్షమించి శిష్యుడిగా స్వీకరించమని ప్రార్థించాడు!

ఆ బాలసాధువు ఎవరు? అహంకారంతో దురుసుగా ప్రవర్తించిన పండితుడు ఎవరు?





# గోవిందయ్య గోతాం

విశాలపురంలో గోవిందయ్య అనే భాగ్య వంతుడున్నాడు. కూర్చుని తిన్నా తరతరాల దాకా తరగని ఆస్తి ఆయనకున్నది. అందువల్ల ఆయన చుట్టూ చుట్టాలు, స్నేహితులు చేరి ఎల్లవేళలా ఆయన్ను అదేపనిగా పొగుడు తూంటారు.

గోవిందయ్య కవి కాదు కానీ, ఎన్నో కావ్యాలూ, శాస్త్రాలూ చదివాడు. తనకు తెలిసిన విశేషాలను ఆయన ఎదుటివారికి ఎంతో ఆసక్తికరంగా, చమత్కారంగా చెప్ప గలడు. అటు ఆస్తి, ఇటు చమత్కారం - రెండూ చేరడం వల్ల ఆ ఊళ్ళో, ''వింటే, గోవిందయ్య కబుర్లే వినాలి!'' అనే సామెత కూడా పుట్టింది.

ఇలా వుండగా, కేశవుడనేవాడు విశాలపురం వచ్చాడు. దురదృష్టవశాత్తు ఏదో ప్రమాదంలో వాడి తల్లిదండ్రులు హఠాత్తుగా మరణించారు. ఉన్న కాస్త ఆస్తినీ బంధువులు అన్యాయంగా కాజేసి, ఇంట్లోంచి వెళ్ళగొడితే, పొట్ట చేత బట్టుకుని వాడు విశాలపురం చేరాడు.

ఊళ్ళో అక్కడా ఇక్కడా ఎన్నో ప్రయత్నాలు చేయగా, చివరకు కేశవుడికి, పద్దయ్య ఇంట్లో పని దొరికింది. ఈ పద్దయ్యకు అరవై ఏళ్ళుం టాయి. ఆరోగ్యం అంతంత మాత్రం. కొడుకు లతో, కోడళ్ళతోపడక, వాళ్ళను ఇంట్లోంచి పంపే శాడు. భార్య సీతమ్మ మాత్రం తప్పనిసరైఆయ నతో వుంటున్నది. అయితే, పద్దయ్య ఆమెను రోజంతా ఏవో మాటలు అంటూనే వుంటాడు.

కేశవుడు మంచి వ్యవహారవేత్త. చమ త్కారంలో వాడికి వాడే సాటి. కబుర్లు మొదలు పెట్టాడంటే, చెప్పడానికి వాడికి విసుగు రావాలికానీ, వినేవాళ్ళు వద్దనరు. వాడి వ్యవ హారజ్ఞానం, చతురసంభాషణా, సమయ స్ఫూర్తీ కారణంగా, పద్దయ్య దంపతుల మధ్య తిరిగి అన్యోన్యత ఏర్పడింది. మరి కొన్నాళ్ళకు ఆయన కొడుకులూ, కోడళ్ళూ

'' వసుంధర ''



మళ్ళీ ఇల్లు చేరి, తండ్రితో కలిసి హాయిగా వుంటున్నారు.

ఈ విధంగా, ఏడాది తిరక్కుండా ఆ ఊళ్ళో, 'కేశవుడి మాటలు వింటే, ఎవరింట్లోనూ గొడవలుండవు!'' అని అంతా గొప్పగా చెప్పుకోసాగారు.

ఏ ఆస్తిపాస్తులూ లేని కేశవుడికి, తన ఊళ్ళో ఇంత పేరు రావడం, గోవిందయ్యకు చాలా అవమానం అనిపించింది. సమయం చూసి వాణ్ణి ఎలాగైనా చిన్నబుచ్చాలని ఎదురుచూస్తున్నాడు. అలాంటి సమయంలో శివయ్య అనే అతను, ఆయన వద్దకు అప్పు కోసం వచ్చాడు.

ఈ శివయ్య పేదరైతు. అతడికి అపర్ణ అనే పెళ్ళీడుకొచ్చిన కూతురున్నది. ఆమెను, ఆ ఊరి రత్నాలవ్యాపారి కొడుకు, భద్రుడనే వాడు పెళ్ళి చేసుకుంటానన్నాడు. శివయ్యకు ఈ పెళ్ళి ఇష్టమేకానీ, భద్రుడి తండ్రి ఐదు వేల వరహాలు అడిగాడు. సంగతి భద్రుడికి చెబితే, తండ్రి ఒప్పుకుంటేనే, ఈ పెళ్ళి జరుగుతుందన్నాడు.

ఇందువల్ల శివయ్య, గోవిందయ్య వద్దకు అప్పుకు వచ్చాడు. కేశవుణ్ణి కించపరచడానికి ఇదే మంచి అదననుకుంటూ గోవిందయ్య, ''తలకు మించిన అప్పుచేసి చెడిపోకు. మన ఊరి కేశవుడున్నాడే, వాడు వాక్చాతుర్యంలో, మన రాజుగారి ప్రధాన మంత్రిని కూడా మించిపోగలడు. నీ డబ్బు సమస్యను వాడు మాటలతో పరిష్కరించగలడేమో ప్రయత్నించి చూడు!'' అని సలహా ఇచ్చాడు.

శివయ్య తనకీ ఆలోచన రానందుకు బాధపడుతూ, కేశవుడి దగ్గరకు వెళ్ళి సంగతి చెప్పాడు.

''భద్రుడికి, అపర్ణను చేసుకోవాలని అంతగా వుంటే, కట్నకానుకలెందుకు? అంత అందగత్తెకు పైసా కూడా కట్నం ఇవ్వకూడదు. ఆమెకిష్టమైతే, నేనే ఆమెను పెళ్ళి చేసుకుంటాను,'' అన్నాడు కేశవుడు.

ఈ వార్త భద్రుడికి చేరింది. అతడు వెంటనే శివయ్య ఇంటికివచ్చి, ''కట్నం విషయంలో, నా తండ్రిని ఏదోవిధంగా ఒప్పించి తీరతాను. ఏకట్నమూ వద్దు. అపర్ణతో నా పెళ్ళి జరిపించు,'' అన్నాడు.

ఆ సమయంలోకేశవుడు అక్కడే వున్నాడు. అతడేదో అనబోయేంతలో, అపర్ణ కల్పించుకుని, 'కేశవుడు, నన్ను చేసుకుంటాననకపోతే, నువ్వు నా తండ్రి వద్ద కట్నం తీసుకుని వుండే

వాడివి. నేను కేశవుణ్ణే పెళ్ళి చేసుకుంటాను,'' అన్నది.

ఇది విని కేశవుడు కంగారుపడి, ''భద్రుడి మనసు మార్చడానికే నేనామాట అన్నాను. అతణ్ణి చేసుకుంటే భోగభాగ్యాలతో తుల తూగుతావు. తాత్కాలికావేశంతో తొందరపడి తప్పు నిర్ణయం తీసుకోకు,'' అంటూ అపర్ణను హెచ్చరించాడు.

భద్రుడు ముఖం చిన్నబుచ్చుకుని అపర్ణతో, ''సరే, అంతా నీ ఇష్టం! నీవు కోరినట్టు, పెళ్ళయ్యాక చందనపురం తీసుకువెళ్ళి అక్కడి వింతలన్నీ చూపించాలనుకున్నాను. నన్ను నిరాశపరిచావు,'' అంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఈ చందనపురం గురించి అందరూ చాలా విశేషంగా చెప్పుకుంటారు. అక్కడికి వెళ్ళాలంటే ఓడమీద సముద్రప్రయాణం చేయాలి. అక్కడ ఎన్నో వింతలూ, అద్భుత వస్తువులూ వున్నాయని చెప్పుకుంటారు.

నెలరోజుల తర్వాత కేశవుడికీ, అపర్ణకూ పెళ్ళి జరిగింది. ఊరంతా కేశవుడి గురించి ఎంతో గొప్పగా చెప్పుకున్నారు. గోవిందయ్య, కేశవుడి తెలివికి ముక్కున వేలుషేసుకున్నాడు. కేశవుడి ఇంట్లోనే సమస్యలు సృష్టించి, అతణ్ణి ఇబ్బంది పెట్టాలని, ఆయనలో పట్టుదల కలిగింది.

ఒకనాడు, గోవిందయ్య, కేశవుడింటికి వెళ్ళి, ''నేను చందనపురం వెళుతున్నాను. నీ భార్య అపర్ణ నాకు కూతురులాంటిది. ఆమెను నాతోపాటు తీసుకువెళ్ళి చందనపురం చూపించాలని వున్నది. నీకు అంగీకారమేనా?'' అని అడిగాడు.



''ఒకటి, రెండు నెలల తర్వాత మేం ఇద్దరం కలిసి చందనపురం వెళ్ళాలనుకుంటున్నాము. మీమాట కాదన్నందుకు ఏం అనుకోకండి,'' అన్నాడు కేశవుడు తాపీగా.

తనపథకం పారనందుకు విచారపడుతూ, గోవిందయ్య ఒక్కడూ మరునాడు చందనపురం వెళ్ళాడు.

ఇది జరిగాక, కేశవుడికి తన భార్యకు చందనపురం చూపాలని పట్టుదల వచ్చింది. అతడి మామ శివయ్య ప్రయాణానికి అవసరం అయిన డబ్బు ఇచ్చాడు. కేశవుడు, భార్యతో బయల్దేరి చందనపురం వెళ్ళాడు.

నాలుగు వారాల తర్వాత, గోవిందయ్య చందనపురం నుంచి తిరిగి వచ్చాడు. అక్కడి విశేషాలు తెలుసుకునేందుకు చుట్టాలూ, స్నేహితులూ ఆయనింటికి వచ్చారు. గోవిం

దయ్యవాళ్ళతో, ''ఈ భూమ్మీదఅలాంటినగరం వున్నదంటే నమ్మడం కష్టం!'' అంటూ, వాళ్ళకు తను తెచ్చిన కొన్ని వస్తువులు చూపించాడు.

వాటిలో అందమైన పట్టుచీరలున్నవి. తళతళమెరిసే కుచ్చుటోపీలున్నవి. నగిషీ చెప్పులున్నవి, ఇంకా అనేక విచిత్ర వస్తువులూ వున్నవి.

''మీకింకా చెప్పవలసిన చాలా వింత లున్నవి. ఒకవారం ఆగి రండి!'' అన్నాడు గోవిందయ్య వాళ్ళతో.

అయితే, వారం గడిచినా గోవిందయ్య ఇంటికి ఎవరూ రాలేదు. కారణమేమిటంటే - ఈ లోపల కేశవుడు భార్యతో చందన పురం నుంచి తిరిగివచ్చాడు. తనకు తెలిసిన వారందరికీ రకరకాల వస్తువులు బహు మానంగా ఇచ్చాడు.

ఇది విన్న గోవిందయ్య, ఆ బహు మతులు తీసుకున్నవారిలో కొందరిని పిలిచి, వాళ్ళలో చలపతి అనేవాడు నెమలి ఈకల కలాన్నొకటి చూపగానే, ''అయ్యో, పాపం నీకు అంతే యోగమున్నదన్నమాట! నేను నీ కోసం బంగారు ఉంగరం తెచ్చాను. అందరికీ కానుకలుగా ఇవ్వాలనుకున్న వస్తువులన్నీ ఒక గోతాంలో వేశాను. ఓడ దిగే సమయానికి ఎక్కడపోయిందోమరి - ఆ గోతాం దొరక లేదు!'' అన్నాడు.

ఆ సమయంలో అక్కడికొచ్చిన కేశవుడు, గోవిందయ్య గోతాం కథ విని తనలోతాను నవ్వుకున్నాడు.

కేశవుణ్ణి చూసిన గోవిందయ్య, ''ఏం, కేశవా! నువ్వు నాకోసం ఎలాంటి బహుమతీ తెచ్చినట్టు లేదే!'' అన్నాడు.

కేశవుడు బాధ నటిస్తూ, ''నా దగ్గర వస్తు వులు ఎక్కువైపెట్టేందుకు చోటులేక, కొన్ని మీ గోతాంలో వేశాకదా! అందులో మీకోసమని తెచ్చినముత్యాలహారమొకటుంది. అయ్యో, ఆ గోతాం పోయిందన్న మాట!'' అన్నాడు.

కేశవుడి చమత్కారం తెలిసిన అక్కడ వున్న వాళ్ళందరూ ఘొల్లుమన్నారు. అప్పటి నుంచీ కేశవుడు, తననింకెవరైనా, ''నాకోసం చందనపురం నుంచి ఏమీ తేలేదేం?'' అని అడిగితే, ''ఏం చేసేది! దాన్ని గోవిందయ్య గోతాంలో వేశాను కదా, పోయింది మరి!'' అనేవాడు.



# THE AMUL CHEESE BOY

IN PICNIC PANIC



































# ముక్కుపుడక - ముక్కు

అది ఒక అందమైన సాయంకాలం. గ్రామప్రజలు గ్రామం మధ్యవున్న చెట్టుకింద ఎత్తయిన వేదిక ఏర్పాటు చేశారు. ఆ వేదికపై కూర్చుని సుప్రసిద్ధ భక్తకవీ, సాధువూ అయిన తులసీదాసు తాను రచించిన 'రామచరిత్ మానస్' నుంచి పద్యాలను శ్రావ్యంగా ఆలపిస్తున్నాడు. వేదిక ముందు పచ్చికమైదానంలో కూర్చున్న భక్తులు గ్రంథ పఠనాన్ని మైమరచి వింటున్నారు. తులసీదాసు మధ్యమధ్య శ్రీరాముడి కల్యాణ గుణగణాలను వివరిస్తూ పద్యపఠనాన్ని సాగించాడు.

రెండు మూడు గంటల తరవాత పద్య పఠనం పూర్తయింది. భక్తులు లేచి ఇళ్ళకు బయలు దేరారు. కొందరు వచ్చి తులసీదాసు పాదాలకు భక్తితో నమస్కరించి వెళ్ళారు. తులసీదాసు రామనామాన్ని స్మరిస్తూ వాళ్ళను ఆశీర్వదించసాగాడు.

అప్పుడు ఆ సాధువుకు, ఆ గ్రామంలో ఆతిథ్యమిచ్చిన భూస్వామి సమీపించి, ''స్వామీ! ఆలస్యమవుతోంది. స్నానం చేసి పూజాధ్యానాలు పూర్తిచేసిగానీ, తమరు భోజనం చేసి నిద్రకు ఉపక్రమించరుకదా? బయలుదేరుదాం!'' అన్నాడు వినయంగా.

తులసీదాసు తలపంకించి లేచి నిలబడ్డాడు. అప్పుడాయన దృష్టి వేదికకు పక్కన ఒక మూలగా నిలబడివున్న ఇల్లాలి మీద పడింది. ఆమె నిల బడిన తీరూ, చూపులూ చూస్తూంటే - ఆమె తన దగ్గరికి రావడానికి ఎందుకో సంకోచిస్తున్నట్టు తులసీదాసుకు తోచింది. ఆమెకేసి చేయి చూపుతూ, "నాకోసం చూస్తున్నావా, తల్లీ?'' అన్నాడు తులసీదాసు ఆప్యాయంగా.

ఆమె పట్టరాని సంతోషంతో గబగబా వచ్చి, మోక రిల్లి ఆయన పాదాలకు నమస్కరించింది. తులసీ దాసు ఆమె తలను మృదువుగా స్పృశించి ఆశీర్వ దించాడు. ఆమె లేచి నిలబడింది. ఆమె పెదవులపై నవ్వు ఇంకా అలాగే వుంది. కొంత సేపు గడిచింది.

''బిడ్డా! నువ్వేమైనా చెప్పాలనుకుంటున్నావా?'' అని అడిగాడు తులసీదాసు.

''పెద్దగా ఏమీలేదు స్వామీ! అయినా ఒకటి!'' అంటూ అటూ ఇటూ చూసి, ''మహాత్మా! నా

ముఖంలో ఏదైనా అద్భుతమైనది కనిపిస్తున్నదా?'' అని అడిగింది.

''దేవుడు ప్రసాదించిన పసిబిడ్డ ముఖం లాగా నీ ముఖమే చాలా అద్భుతంగా ఉన్నది తల్లీ!'' అన్నాడు తులసీదాసు.

''నా ముఖంలో అద్భుతమైన అందంతో ముక్కుపుడక మీకు కనిపిస్తున్నది కదా!'' అని అడిగిందా యువతి మళ్ళీ.

''కనిపిస్తున్నది తల్లీ. చాలా బావున్నది!'' అన్నాడు తులసీదాసు.

ఆమె పెట్టుకున్న ఆ విలువైన ముక్కు పుడకను ఇరుగుపొరుగు మెచ్చుకున్నట్టే, తాను కూడా మెచ్చుకోవాలని ఆమె తాపత్రయపడు తున్నదని ఆయన గ్రహించాడు.

''ఇది చాలా బావుంది కదూ. అవును, దానికి అమితమైన ధరపెట్టి నా భర్త నిన్నే కొనితెచ్చాడు. నాకోసం ఎందుకలా దుబారా ఖర్చు అని వారించాను. ఎంత వద్దంటున్నా పట్టించుకోకుండా నాకీ విలువైన ముక్కు పుడక కొని ఇచ్చారు. నామీద ఆయనకున్న ప్రేమ అలాంటిది. అయినా మీర న్నట్టు నగ చాలా బావుంది కదూ? అద్భుతంగా వుంది కదూ!'' అన్నది మళ్ళీ నవ్వుతూ.

''అవును తల్లీ, ముక్కుపుడక చాలా బావుంది. దానిని నీకు కొనిపెట్టి నీ అంద మైన ముఖానికి మరింత అందం సమకూర్చిన నీ భర్త పట్ల నువ్వు చూపుతూన్న కృతజ్ఞత చూస్తూంటే నాకెంతో ఆనం దంగా ఉన్నది. అయినా ఒక్క విషయం! ముక్కు పుడక ఇచ్చిన భర్త పట్ల ఇంత కృతజ్ఞత కనబరు స్తూన్న నువ్వు, నీకు ఆ అందమైన ముక్కును ప్రసాదించిన ఆ దేవుడికి ఎప్పుడైనా కృతజ్ఞతలు చెప్పావా? బిడ్డా! ఇకనుంచి ఆ విషయాన్ని గుర్తుంచు కుని ఆ దేవుణ్ణి స్మరించు తల్లీ. నీకు శుభం కలుగు తుంది!'' అని దీవించాడు తులసీదాసు.

ఆమె, ''అలాగే స్వామీ,'' అంటూ తులసీ దాసుకు మరొకసారి నమస్కరించి, మౌనంగా అక్కడినుంచి బయలుదేరింది.





# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

ఫోటో వ్యాఖ్యల పోటీ, చందమామ, **82**, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - **600 097.**





వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్ కార్డుపైన రాసి ఈ నెల 25 వ తేదీ లోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు జనవరి 2001 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.






సెప్టెంబర్ 2000 నెల సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:

కె. నిజాముద్దీన్,
2-1-560/A/1, శంకరమఠ రోడ్డు,
పి.ఒ. న్యూ నల్లకుంట, హైదరాబాదు-500 044



మొదటి ఫోటో: వేషం చూస్తే భీతికరం!
రెండవ ఫోటో: స్నేహం చేస్తే ప్రీతికరం!!